

చందమామ
పిల్లల కథల మాసపత్రిక
5
8
AS

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

కల్తీతూకం కాదండీ

పంపినవారు:
ఎస్. సీత - మదరాసు - 17.

# చందమామ మదరాసు చందాదారులకు

# చక్కనైన శుభవార్త!

జూలై నెల మన చందమామకు గొప్ప పండగ—పధ్నాలుగో పుట్టిన రోజు పండగ. చందమామ పండగ మీకూ నాకూ పండగేకదా! ఈ సంతోష సమయంలో మీ కొక మంచి వార్త చెప్పనా?— ఇప్పుడు ఒక అపూర్వమైన చందా పధకం అందజేస్తున్నాము.

ఈ పథకం ప్రకారం మీకు ఒక్కొక్క విడిసంచిక ఖరీదులోను నూటికి 12½ చొప్పున ఆదా వుంటుంది. పైగా, వచ్చేనెల 'జన్మదిన సంచిక'తో సహా ఒక యేడాదిపరకూ, కలకలలాడే 'చందమామ' నెలనెలా మీ యింటికే వచ్చి చేరుతుంది, మిమ్మల్ని కిలకిలలాడిస్తుంది! అయితే, ఈ అవకాశం ఈ జూలై 7-వ తారీఖువరకే. ఈ మాట మరచిపోకండి.

మీరు చేయవలసిందల్లా—ఈ కింది కార్డు పూర్తిచేసి మాకు పంపించడమే. ఈ పధకం ప్రకారం అయ్యే సాలుచందా రు. 5-25 లున్ను మా ప్రతినిధి మీవద్దకు వచ్చినప్పుడు ఇవ్వండి. అంతే. మరి వుంటా—

మదరాసు నగరంలో
మీ 'చందమామ' ఏజంటు.

---

ఓడియన్ న్యూస్ ఏజన్సీ,
'చందమామ' చందా ఏజంట్లు,
79, జనరల్ పేటర్స్ రోడ్, మదరాసు-2.

తేది..........

అయ్యా,

చందమామ 'పుట్టిన రోజు పథకం' ప్రకారం, నాకు జూలై 1960 సంచికనుండి ఒక సంవత్సరం, 'చందమామ' మా యింటి చిరునామాకు పంపించండి. చందా రు. 5-25 లు మీరు కోరిన వెంటనే చెల్లించగలను.

పేరు: ..........

చిరునామా: ..........

సంతకం.

# ఉమా గోల్డు కవరింగు వర్క్సు

హెడ్ ఆఫీసు: ఉమా మహలు :: మచిలీపట్టణము



















"ఉమా" బొత్తము ధర రు. 0.85

"ఉమా" కమ్మల జత ధర రు. 2.25

"ఉమా" వయరు కటింగు గాజులు జత 2.4 సైజు ధర రు. 11.50

"ఉమా" బొబ్బిలి గాజులు 2.4 సైజు జత ధర రు. 18.00

"ఉమా" వెడ్డింగు నెక్‌లేసు ధర రు. 20-00 ★ సాధారణ వి. పి. పార్సెలు చార్జీ రు. 1-37

మేము తయారుచేయు అసలు బంగారు కవరింగు "ఉమా" బ్రాండ్ నగలు అనేక సంవత్సరములు మన్నిక యుండి తృప్తిపరచును. ఎప్పుడున్ను, అన్ని శుభకార్యములకున్ను ఉపయోగించవచ్చును. మాయొక్క బ్రాంచీలయందుగాని, హెడ్డాఫీసునందుగాని లభించును.

బ్రాంచీలు:

90, చైనాబజారు రోడ్డు, మద్రాసు - 1. ★ 581, శివాలయం వీధి, విజయవాడ.

* ఆర్డర్లకు, ఉత్తర ప్రత్యుత్తరాలకు, క్యాటలాగుకు హెడ్డాఫీసుకు మాత్రమే.

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక:
చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




ధైర్యశాలి
రామూ
డంబాల
రంగా


భద్రం, రంగా
శరవేగంగా వస్తోంది
గుఱ్ఱం.


ఇట్టి గుఱ్ఱాలనెన్నో
చూశానులే,
నాకున్నంత బాహు
బలానికి...


...నడిచే మోటార్ కారును ఎడంచేత్తో ఆపగలను...


...ఏనుగును నా చాతీమీద
నడిపించుకోగలను...


..చెలరేగిన ఎడ్లను నాపళ్లతో లాగుతాను..


నీవు మహావీరుడవు! కాని, అమేక కన్ను నీ అరటి పండు మీదుంది చూడు.








ఎందుకేడుస్తున్నావు! నీకు పదిమాట్లు చెప్పాను, నీవు బలంగా వుండాలంటే, రోజూ పాలు త్రాగు మరియు 'డాల్డా'తో వండబడిన ఆహారం భుజించు!


అవును, పిల్లలారా! బలానికి 'డాల్డా' వనస్పతి అవసరం. 'డాల్డా'లో ఎ, డి, విటమిన్‌లు కలుపబడ్డవి. రుచియైన అహారములు
కావాలంటే, మీ ఆహారమును ఎల్లప్పుడూ 'డాల్డా'తో వండమని మీ అమ్మను అడగండి.

**Stanes**

ఇది పరిశుద్ధమైన కాఫీ, పొదుపైన కాఫీ,
మీ రుచికి తగినట్లే ప్రత్యేకంగా తయారైంది.
స్టేన్స్ శుద్ధమైన కాఫీ, ఎన్నికైన కాఫీ,
హొటెళ్ళు, రెస్టారెంట్లు ఎల్లప్పుడు
ఎంచుకునేది ఇదే. మీరూ దీన్నే వాడుకచెయ్యండి.

**Stanes**

# స్టేన్స్
# పరిశుద్ధమైన కాఫీ

ది యునైటెడ్ కాఫీ సప్లై కంపెనీ లిమిటెడ్,
కోయంబత్తూరు.




G. 67






జగపతి
వారి

# అన్నపూర్ణ

దర్శకత్వం...వి. మధుసూదన రావు

నిర్మాతలు...రంగారావు, రాజేంద్రప్రసాద్

డిస్ట్రిబ్యూటర్లు:— ఆంధ్ర: మెసర్స్ వాణీ ఫిలిమ్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ. ★ సీడెడ్: మెసర్స్ విజయా పిక్చర్స్, గుంతకల్. ★ నైజామ్: మెసర్స్ శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్, సికింద్రాబాదు. ★ మైసూరు: మెసర్స్ శారదా మూవీస్, బెంగళూరు.

# "చందమామ"

## జన్మదిన ప్రత్యేక సంచిక

"చందమామ"కు జులై 1960 నుంచి పద్నాలుగో ఏడు ప్రారంభమవుతున్నది. ఆ కారణంగా జులై సంచిక జన్మదిన ప్రత్యేక సంచికగా వెలువరిస్తున్నాము.

ఈ సంచికలో మామూలు శీర్షికలన్నిటితోబాటు త్రివర్ణ చిత్రాలతో కూడిన 16 పేజీల వ్యాసాలు అదనంగా ఉంటాయి.

సర్వాంగసుందరమైన ఈ సంచిక వెల మామూలుప్రకారమే 50 న. పైసలు.

పాఠకులు తమ కాపీలకోసం ముందుగానే జాగ్రత్తపడని పక్షంలో ఆశాభంగం పొందగలరు.

వివరాలకు:

**చందమామ పబ్లికేషన్సు**

మదరాసు - 26.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ"కు పదమూడేళ్ళు నిండుతున్నాయి. ఈ పదమూడేళ్ళ కాలంలో "చందమామ" తన పాఠకులతోబాటు ఎంతో పెరిగింది. ఎన్నోరకాల అందచందాలు సమకూర్చుకున్నది. అచ్చుగా చిన్నపిల్లల విజ్ఞాన వినోదాలకు మాత్రమే తోడ్పడుతుందనుకున్న ఈ పత్రిక త్వరలోనే కుటుంబంలోని అందరి పత్రికా అయిపోయింది. సాహిత్యాభిలాషలో పిన్నలకూ, పెద్దలకూ, స్త్రీలకూ, పురుషులకూ ఉండే వ్యత్యాసాలను సరిచేసిన పత్రిక "చందమామ" ఒక్కటేనని చెప్పవచ్చు. దీని ప్రభావం ఇంకా అనేక ఇతర పత్రికలపైన కూడా పడిందనటానికి సందేహం లేదు.

రాగల "చందమామ" [జులై] సంచిక జన్మదిన ప్రత్యేక సంచికగా వెలువడుతున్నది. ఇందులో మామూలు పేజీలూ, మామూలు శీర్షికలూ మాత్రమే గాక త్రివర్ణచిత్రాలు గల పదహారు పేజీల రచనలు అదనంగా ఉంటాయి. అయినా ఈ ప్రత్యేక సంచిక మామూలు ధరకే పాఠకులకు లభిస్తుంది.

సంపుటి 26 : జూన్ 1960 : సంచిక 6




తిరిగి ఉభయ సైన్యాలూ కలియబడి దారుణమైన యుద్ధకాండ సాగించాయి. ఈ పదకొండో రోజు యుద్ధంలో అభిమన్యుడు విజృంభించి పోరాడాడు. భీముడికీ, శల్యుడికీ ఘోరమైన గదాయుద్ధం జరిగింది. అందులో శల్యుడు ఓడి పారిపోయాడు.

ద్రోణుడు పాండవ సైన్యాలను చించి చెండాడుతూ ధర్మరాజును పట్టుకొనటానికి విశ్వప్రయత్నం చేశాడు. ధర్మరాజుకు అడ్డుగా అనేకమంది పాంచాల యోధులు నిలబడ్డారు. ద్రోణుడు తన కడ్డుపడినవారిలో సింహసేనుడు, వ్యాఘ్రదత్తుడు అనేవారి తలలు తెగవేసి, ధర్మరాజును సమీపించ సాగాడు. ధర్మరాజు చిక్కాడని హాహాకారాలు బయలుదేరాయి. అంతలో అర్జునుడు వచ్చిపడి చీకటి పడినదాకా కౌరవ సైన్యాలను బాణవర్షంలో ముంచి కౌరవ యోధులకు ఊపిరి సలపకుండా చేసేశాడు.

ఆ రాత్రి శిబిరంలో ద్రోణుడు దుర్యోధనుడితో, "దుర్యోధనా, అర్జునుడు అడ్డు పడకుండా ఉన్నట్టయితే ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెచ్చిఉందును. ఈ భయంకరమైన యుద్ధంకంటె అదే మంచి ఉపాయంగా తోస్తున్నది. ఎవరైనా ఆ అర్జునుణ్ణి ఇంకొక రంగానికి తీసుకుపోయినట్టయితే ఆ సమయంలో నేను ధర్మరాజును పట్టుకుంటాను," అన్నాడు.

త్రిగర్త రాజైన సుశర్మ ఈ మాటలు విని తన తరఫునా, తన తమ్ముల తరఫునా దుర్యోధనుడితో ఇలా అన్నాడు: "రాజా, మాకు అనాదిగా ఈ అర్జునుడిపై పగ ఉన్నది. మేము అతనికి ఏ ద్రోహమూ చెయ్యకపోయినా అతను అవకాశం దొరికినప్పుడల్లా మాపై కాలుదువ్వి, మమ్మల్ని అవమానిస్తూ ఉంటాడు. అతనిపై పగ తీర్చుకోవటానికి మాకీ యుద్ధం బాగా తోడ్పడింది. రేపు

అతన్ని మేము వేరే యుద్ధరంగానికి పిలుచుకుపోయి అతనో, మేమో తేల్చుకుంటాము: ఇది నీకూ లాభిస్తుంది, మాకూ కీర్తిప్రదంగా ఉంటుంది."

అర్జునుడితో యుద్ధం చెయ్యటానికి ఒక సేన ఆయత్తమయింది. అందులో సత్యరథుడు, సత్యవర్మ, సత్యేషుడు, సత్యవ్రతుడు, సత్యకర్మ అనే అయిదుగురు సోదరులు పదివేల రథాలతో వచ్చి చేరారు. మాలవుడు, తుండికేరుడు అనేవాళ్ళు ముప్పైవేల రథాలతోనూ, సుశర్మా అతని తమ్ములూ పదివేల రథాలతోనూ, నానా దేశాలకు చెందినవారు మరి పదివేల రథాలతోనూ వచ్చి చేరారు.

ఇంతమందీ కలిసి అగ్నిసాక్షిగా ప్రమాణాలు చేశారు: "యుద్ధంలో మేము వెనక్కు తిరిగిపోయినట్టయితే ఘోరమైన నరకాన్ని పొందుతాము. మాకు ప్రాణాలుండగా అర్జునుణ్ణి యుద్ధరంగంనుండి పోనివ్వము," అని ఘోరమైన ఒట్లు పెట్టుకుని ప్రతిజ్ఞలు చేశారు. ఇలాటి ప్రతిజ్ఞలు చేసినవారిని సంశప్తకులంటారు. అందుచేత వీరందరూ సంశప్తకులని పేరు సంపాదించుకున్నారు.

"మాతో వచ్చి ప్రత్యేకమైన రంగంలో పోరాడవలిసింది," అని వారు అర్జునుడికి




ఆహ్వానం పంపారు. అలాటి ఆహ్వానాన్ని తిరస్కరించటం అర్జునుడికి పరువులోపం. అయితే ధర్మరాజు బెంబేలుపడిపోయి, "నాయనా, నన్ను ప్రాణాలతో పట్టుకుని దుర్యోధనుడికి వప్పగించుతానని ద్రోణుడు చేసిన ప్రతిజ్ఞ నీకు తెలుసుగదా!" అన్నాడు.

ఆ మాటకు అర్జునుడు ధర్మరాజుతో, "అన్నా, నేను లేని సమయంలో సత్యజిత్తు నీకు అంగరక్షకుడుగా ఉండి యుద్ధం చేస్తాడు. ఒకవేళ సత్యజిత్తు పడిపోవటమే జరిగితే, మన ఇతర యోధులెంతమంది రక్షిస్తామని వాగ్దానం చేసినా లక్ష్యపెట్టకుండా నీవు రణరంగం నుంచి తొలగి వెళ్ళు. నేను



సాధ్యమైనంత త్వరలో ఆ సంశప్తకుల అంతు తేల్చి తిరిగి వస్తాను," అన్నాడు.

ధర్మరాజు అర్జునుణ్ణి కౌగలించుకుని దీవించి పంపాడు. సంశప్తకులు యుద్ధరంగానికి దక్షిణంగా సమావేశమై చంద్రాకారంగా వ్యూహం పన్ని అర్జునుడికోసం ఎదురు చూస్తున్నారు. అర్జునుడు ఒంటరిగా వారితో యుద్ధం చేయటానికి వచ్చాడు.

ఈ యుద్ధంలో సుధన్వుడనేవాడు అర్జునుడి బాణాలకు బలిఅయాడు. వెంటనే అతని సేనలు చెదిరి కౌరవ సేనలకేసి పరిగెత్తసాగాయి. సుశర్మ ఎలుగెత్తి అరుస్తూ, "యోధులారా, పారిపోకండి! మీరు చేసిన ప్రతిజ్ఞలు మరవకండి! అన్నమాట నెరవేర్చకుండా తిరిగివచ్చిన మిమ్మల్ని చూసి దుర్యోధనుడు ఏమనుకుంటాడు?" అన్నాడు. పారిపోతున్న యోధులు తిరిగివచ్చి అర్జునుడితో యుద్ధం సాగించారు. అర్జునుడు సంశప్తకులను కార్చిచ్చులాగా నాశనం చెయ్యసాగాడు.

ఈలోపుగా అసలు రంగంలో పాండవ కౌరవ సైన్యాలు పన్నెండవ రోజు యుద్ధం ప్రారంభించాయి. అర్జునుడు దూరాన సంశప్తకులతో పోట్లాడుతున్నాడు గనక ద్రోణుడు యుద్ధారంభంనుంచికూడా ధర్మరాజును సమీపించటానికే ప్రయత్నిస్తూ యుద్ధంచేశాడు. ఆయన చేసిన యుద్ధం అతి భయంకరమైనది.

ధర్మరాజుకు అంగరక్షకుడుగా అర్జునుడు నియమించిన సత్యజిత్తూ, అతనికి సహాయుడుగా వృకుడనేవాడూ ద్రోణుడితో తీవ్రంగా తలపడి ఆయన చేతిలో ఇద్దరూ చచ్చారు. సత్యజిత్తు చనిపోగానే ధర్మరాజు తన రథాన్ని ద్రోణుడికి దూరంగా తరలించాడు. అదే సమయంలో అనేకమంది పాండవపక్షయోధులు ద్రోణుడికి అడ్డుతగిలి పోరు సాగించారు. పాంచాల్యుడనే ఒక రాజపుత్రుడుకూడా ద్రోణుడి చేతిలో

ప్రాణాలు పోగొట్టుకున్నాడు. చెల్లాచెదరై పారిపోతున్న పాండవ సేనలను భీముడు మొదలుగాగల పాండవయోధులు వెనక్కు మళ్లించారు. భీముడు కౌరవ సేనలలో గల గజయూథాలను నిర్మూలించసాగాడు. ఇది చూసి భగదత్తుడు తన ప్రసిద్ధమైన ఏనుగుతో వచ్చి పాండవ వీరులనూ, సైన్యాలనూ చెల్లాచెదరు చెయసాగాడు. భీముడు సయితం భగదత్తుడి ఏనుగును ఏమీ చెయ్యలేక పోయాడు. దానికి వెరచి పాండవ సేనలు హాహాకారాలు చెయ్యసాగాయి.

అక్కడ సంశప్తకులతో పోట్లాడే అర్జునుడికి తమ సేనలను భగదత్తుడు చికాకు పరుస్తున్న సంగతి పొడగట్టి కృష్ణుడితో తన రథాన్ని కౌరవ సేనలవేపు నడపమనీ, భగదత్తుణ్ణి జయించగలవాడు తాను తప్ప మరొకరెవరూ లేరనీ అన్నాడు. కృష్ణుడు రథాన్ని వెనక్కు మళ్లించబోయాడు.

అయితే సుశర్మ మొదలైన త్రిగర్తులు అర్జునుణ్ణి చుట్టుముట్టి కదలనివ్వలేదు. అర్జునుడు వారితో ఒకవంక యుద్ధం చేస్తూనే తన రథాన్ని కౌరవ సేనలకేసి నడిపించుకున్నాడు. ఈ యుద్ధంలో అర్జునుడు సుశర్మను తన తీవ్రమైన బాణాలతో తరిమిగొట్టటమేగాక అతని తమ్ముణ్ణి చంపాడుకూడా.





త్వరలోనే అర్జునుడి రథం కౌరవ సైన్యాన్ని చేరుకుని భగదత్తుణ్ణి ఎదుర్కొన్నది. ఇద్దరికీ దారుణమైన యుద్ధం సాగింది. భగదత్తుడు తోమరాలను గురిచేసి అర్జునుడి తలపైకి విసిరాడు. వాటి తాకిడికి అర్జునుడి కిరీటం పక్కకు ఒరిగింది. అర్జునుడు దానిని సరిచేసుకుంటూ, "ఇదేనా నీ గురి?" అన్నాడు.

ఆ మాట విని భగదత్తుడికి మండిపోయింది. అతను వైష్ణవాస్త్రం తీసి అభిమంత్రించి అర్జునుడి రొమ్ముకేసి ప్రయోగించాడు. అమోఘమైన ఆ అస్త్రం అర్జునుడి పైకి వస్తుంటే అకస్మాత్తుగా కృష్ణుడు లేచి నిలబడి తన రొమ్మును దానికి గురిచేశాడు. వైష్ణవాస్త్రం కాస్తా వైజయంతిమాలగా మారి కృష్ణుడి మెడను అలంకరించింది.

అర్జునుడికి భరించరాని అవమానమయింది. అతను కృష్ణుడితో, "దేవా, ఇంక నేను యుద్ధం చెయ్యటం దేనికి, గుర్రాలను నడుపుతాను! నేను అశక్తుడనై ప్రమాద స్థితిలో ఉండగా నీవు రక్షించవచ్చునుగాని, గాండీవం చేతబట్టుకుని సురాసురులనైనా జయించగల స్థితిలో ఉండగా నన్ను నీవిలా కాపాడటం ఏమైనా భావ్యమా?" అన్నాడు.

"అర్జునా, నీకొక రహస్యం చెబుతాను విను. ఒకప్పుడు భూదేవి తన కొడుకైన నరకాసురుడికోసం ఈ వైష్ణవాస్త్రం సంపాదించింది. అది దగ్గిర ఉంచుకుని వాడు విజృంభించి లోకాలన్నిటినీ పీడించి చివరకు నా చేతిలో చచ్చాడు. వాడి అనంతరం ఈ వైష్ణవాస్త్రం వాడి కొడుకు ఈ భగదత్తుడి చేతికి వచ్చింది. అది దగ్గిర ఉండటంచేతనే వీడు అజేయుడుగా ఇంతకాలమూ ఒక వెలుగు వెలిగాడు. ఇక వీడిలో ఏ శక్తి లేదు. కనక వీణ్ణీ, వీడి ఏనుగునూ నీవు అతి సులువుగా నిర్మూలించవచ్చు!" అన్నాడు.

అక్షరాలా అలాగే జరిగింది. అర్జునుడు ఒక వాడికోల విసిరేసరికి భగదత్తుడి ఏనుగు



కుంభస్థలం పగిలి అదికాస్తా చచ్చి పడిపోయింది. తరవాత ఒక అర్ధచంద్ర బాణంతో అర్జునుడు భగదత్తుణ్ణి చంపేశాడు.

తరవాత ఆ రోజు నడిచిన యుద్ధంలో అర్జునుడు శకుని తమ్ములైన వృషకుణ్ణీ, అచలుణ్ణీ చంపేశాడు, కర్ణుడి తమ్ములను ముగ్గురుని కర్ణుడూ, దుర్యోధనుడులూ చూస్తుండగా చంపేశాడు.

ఈ రోజు జరిగిన యుద్ధం పాండవులకు అనుకూలంగానూ కౌరవులకు అవమానకరంగానూ ఉన్నది. అర్జునుడు కౌరవసేనలను చాలా క్షోభ పెట్టాడు.

ద్రోణుడు తను చేసిన శపథం నెరవేర్చుకోలేకపోయాడు. ధర్మరాజు ఆయనకు పట్టుబడలేదు.

ఆరాత్రి గడిచి మర్నాడు తెల్లవారుతూనే దుర్యోధనుడు ద్రోణాచార్యుణ్ణి సమీపించి, "మేము నీకు శత్రుకోటిలోవాళ్లమని స్పష్టమయింది. లేకపోతే సమీపానికి వచ్చిన ధర్మరాజును ఎందుకు తప్పించుకుపోనిస్తావు? మొదట నాపైన అనుగ్రహం పుట్టుకొచ్చి మాట ఇచ్చావేగాని, తీరా మాట నెరవేర్చుకోవలిసి వచ్చేసరికి నీ మనసు మారిపోయింది. పెద్దమనిషి అయినవాడు ఆశ రేపి నిరాశ చేస్తాడా?" అని దెప్పిపొడిచాడు.

ఈ మాటలు విని ద్రోణుడు ఎంతో సిగ్గుపడి, "రాజా, నీ సంతోషం కోసమే కృషి చేస్తున్న నన్ను గురించి ఇలా అనటం ధర్మం కాదు. అర్జునుడు రక్షించే సైన్యాన్ని ఎవరు గెలవగలరు? నేనివాళ ఒక గొప్ప వ్యూహాన్ని నిర్మిస్తాను. అది దేవతలకుకూడా భేదించరానిది. దానిని భేదించటానికి మహావీరుడు తప్ప ప్రయత్నించలేడు. అర్జునుడు యుద్ధరంగానికి ఇవాళకూడా దూరంగా ఉండేటట్టు చూసినట్టయితే మిగిలిన పాండవపక్షవీరులలో ఎవరో ఒకరు ఈ వ్యూహానికి తప్పక బలి అవుతారని నీకు మాట ఇస్తున్నాను," అన్నాడు.



ఆ తరవాత సంశప్తకులు మళ్ళీ అర్జునుణ్ణి యుద్ధభూమికి దక్షిణంగా తీసుకుపోయారు. ద్రోణుడు కౌరవసేనలను పద్మవ్యూహంలో నిర్మించాడు. పద్మవ్యూహాన్ని భేదించటం తెలిసినవారు నలుగురే ఉన్నారు—కృష్ణుడూ, ప్రద్యుమ్నుడూ, అర్జునుడూ, ఇంకా మీసకట్టుకూడా రాని అభిమన్యుడూనూ. వారిలో అభిమన్యుడొకడే ఆరోజు రణరంగంలో ఉన్నాడు. అందుచేత ధర్మరాజు అతణ్ణి పిలిపించి, "నాయనా, ఈనాడు చాలా పెద్దభారం నీపైన పడింది. నీ తండ్రీ, మేనమామా ఉన్నట్టయితే ఈ పద్మవ్యూహం సులువుగా భేదించేవారు. కాని వారు సంశప్తకులతో యుద్ధంచేయబోయారు. మాలో నీవొక్కడవే దాన్ని భేదించ గలవాడవు. నీవు మాకు నాయకుడవుగా ఉండి పద్మవ్యూహాన్ని భేదించి లోపల ప్రవేశించినట్టయితే మిగిలినవాళ్ళం నీ వెంట వచ్చి వ్యూహాన్ని చెదరగొట్టగలం," అన్నాడు.

ఇందుకు అభిమన్యుడు సమ్మతించి పద్మవ్యూహాన్ని భేదించటానికి సిద్ధపడ్డాడు. అతను బంగారు కవచం ధరించి, కర్ణికార ధ్వజం గల రథంలో ఎక్కి కూచుని తన రథసారథి అయిన సుమిత్రుడితో, "పద్మవ్యూహ ద్వారాన్ని ద్రోణుడు రక్షిస్తున్నాడు. మన రథాన్ని నేరుగా ఆయనవద్దకు తోలు. ఆయనను జయించి నేను పద్మవ్యూహంలో ప్రవేశిస్తాను," అన్నాడు.

సుమిత్రుడికి ఇది ఏమాత్రమూ నచ్చలేదు. పాండవులు ఇంత భారాన్ని ఇలాటి పసివాడిపై ఉంచటం అన్యాయమని అతనికి తోచింది. "బాబూ, నీవు శూరుడవేగాని, సుకుమారంగా పెరిగినవాడివి!" అన్నాడతను. అభిమన్యుడు నవ్వి, "ఓయీ, నా తండ్రి అర్జునుడు, కృష్ణుడు నా మేనమామ. నాకు భయమన్నది లేదు. దేవతలతో కలిసి వచ్చిన ఇంద్రుడినైనా ఎదిరించగలను. రథాన్ని ద్రోణుడివేపు తోలు!" అన్నాడు.






## 6

[చిత్రసేనుడు తన అనుచరులతో కోటకు వెళుతూండగా, ఉగ్రాక్షుడు పంపగా వచ్చిన రాక్షసులు, అతణ్ణి తిరిగి తమ నాయకుడి వద్దకు పిలుచుకుపోయారు. అక్కడ చిత్ర సేనుడికి అమరపాలుడనేవాడు కనిపించాడు. వాడు జ్వాలాద్వీప వాసులను గురించిన కొన్ని రహస్యాలు చెప్పి, హఠాత్తుగా మూగిలా ఆకాశంకేసి తల ఎత్తాడు. తరవాత—]

అమరపాలుడి ఈ విచిత్ర ప్రవర్తన చిత్ర సేనుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించి పోతూ, చేత గల రాతి గదను పైకెత్తి ఝుళి పిస్తూ, "ఏమిరా, నీకేమైనా బుర్రతిరుగుడు వ్యాధి పుట్టుకొచ్చిందా? ఈ గదతో ఒక్కటి మోది, దాన్ని సరిచెయ్యమంటావా?" అంటూ గర్జించాడు.

అమరపాలుడు ఏమాత్రం భయపడలేదు. అతడు చిరునవ్వుతో ఉగ్రాక్షుడి భీకరాకారం కేసి చూస్తూ, "నా చావు తరవాత, నీ చావుకు ఎంతో కాలం పట్టదు. కపిలపురాన్ని ఆక్ర మించుకున్న నాగవర్మ సంగతి నీకు తెలుసు గదా? అతడికి సహాయం చేస్తున్న జ్వాలా ద్వీప వాసులూ, వాళ్ల భయంకర పక్షులూ, నీ దేహంమీద వదిలిపోయిన మాయని గుర్తుల విషయం మరిచిపోకు," అన్నాడు.

అమరపాలుడు తన గాయాలకు కట్టి వున్న కట్ల విషయమై హేళన చేస్తున్నాడని ఉగ్రాక్షుడు గ్రహించి, భయంకరంగా హుంక



రిస్తూ, రాతి గడతో అతడి తల పగలకొట్టేం దుకు ముందుకు అడుగు వేశాడు. కాని, అంతలో చిత్రసేనుడు రాక్షసుడికీ, అమర పాలుడికీ మధ్యగా వెళ్ళి నిలబడి, "ఆగు, ఉగ్రాక్షా!" అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

"వీడు...వీడు, ఈ మానవాధముడు నన్ను యింత హేళనగా మాట్లాడతాడా!" అంటూ ఉగ్రాక్షుడు కోరలు చాచాడు.

"మానవులంటే అంత చులకనగా మాట్లాడకు. ఇతడు మనకు సహాయం చేస్తా డని నా నమ్మకం. అలా కానప్పుడు, నీ యిష్టంవచ్చినట్టుగా యితణ్ణి హింసించ వచ్చు," అన్నాడు చిత్రసేనుడు.



చిత్రసేనుడు యిలా అనగానే అమర పాలుడు నిలువెల్లా వణికిపోతూ, "మహా రాజా, యిది అన్యాయం. మీరు నాకు ప్రాణ దానం చేస్తామని వాగ్దానం చేశారు. ఆ మాట నమ్మి నేను చెట్టు దిగి వచ్చాను. లేకపోతే ఈ రాక్షసుల చేతుల్లో పడకుండా, అక్కడే ఆత్మహత్య చేసుకుని వుండేవాణ్ణి!" అన్నాడు.

"నీకు ప్రాణాపాయం కలగదని, నేను వాగ్దానం చేసిన మాట నిజమే. కాని, నువ్వు అది అవకాశంగా తీసుకుని, నా ప్రశ్నలకు ప్రత్యుత్తరం యివ్వకుండా, ఆకాశంకేసి గుడ్లు మిటకరించే వెర్రిమొర్రి వేషాలు వేస్తున్నావు. ఇలాంటి పరిస్థితుల్లో, నా వాగ్దానం నిలుపుకోవలసిన అవసరం లేదు," అన్నాడు చిత్రసేనుడు కఠినంగా.

"క్షమించండి, మహారాజా! నేను ఈ క్షణంనుంచి మీసేవకుణ్ణి. రాజద్రోహి అయిన నాగవర్మమీద నాకెలాంటి గౌరవం లేదు. క్రూరమృగాల్లాంటి జ్వాలాద్వీపవాసులంటే నాకు మొదటినుంచీ ద్వేషమే. కాని, నాగ వర్మకు వెరిచి, నేను వాళ్ళల్లో చేరాను," అన్నాడు అమరపాలుడు దీనంగా.

"అలాఅయితే, దాచకుండా నీకు తెలిసిన దంతా చెప్పు. ధవళగిరిమీద దాడికి వెళ్ళిన నాగవర్మ సైన్యాలవెంట, భయంకర పక్షు





లెక్కన జ్వాలాద్వీపవాసులెవరైనా వున్నారా?" అని అడిగాడు చిత్రసేనుడు.

"ఉండినా వుండొచ్చు. కపిలపురానికి అనుకునివున్న అడవిలో దాదాపు నూరు భయంకర పక్షులు రౌతులతోపాటు స్థావరాలు ఏర్పరుచుకున్నవి. జ్వాలాద్వీపవాసులకు బానిసలుగా నాగవర్మ తన ప్రజల్లో కొందరిని యిచ్చాడు. దాసిగ్గాను వాళ్ళు అతడికి, ఈ సహాయం చేస్తున్నారు," అన్నాడు అమరపాలుడు.

"ఈ భయంకర పక్షుల్ని చంపేందుకు సులువైన మార్గం ఏమైనా వుందా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు తన గాయాలకు కట్టివున్న కట్లను సర్దుకుంటూ.

"లేకేం, వున్నది. వాటి ముక్కులకూ, గోళ్ళకూ చిక్కకుండా తప్పుకోగలిగితే, వాటి మెడను ఒక చిన్న కత్తివేటుతో తునాతునియలుగా నరికివెయ్యవచ్చును. మెడ విషయంలో వాటికీ యితర పక్షులకూ తేడా ఏమీ లేదు," అన్నాడు అమరపాలుడు.

"హ్హహ్హ!" అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, "ఈసారి ఆ దుర్మార్గులు తటస్థపడితే, నా ప్రతాపం చూపుతాను!" అంటూ జబ్బలు చరచసాగాడు. అంతలో కొందరు రాక్షసులూ, ప్రజలూ గగ్గోలు పెడుతూ,



"మహానాయకా! మహారాజా!" అంటూ అక్కడికి పరిగెత్తి రాసాగారు.

ప్రాణభీతితో హాహాకారాలు చేస్తూ, తమను సమీపిస్తున్న ప్రజలనూ, రాక్షసులనూ చూస్తూనే, చిత్రసేనుడు మరేదో పెద్ద ప్రమాదం ముంచుకువచ్చిందని వూహించాడు. "మహారాజా! జడలమర్రి దగ్గిర పశువుల్ని మేపుకుంటున్న మామీద, భయంకర పక్షులూ, పులిరాయుళ్లూ వచ్చిపడ్డారు. వాళ్లు పశువుల్నీ, మనుషుల్నీ ఎత్తుకుపోతున్నారు. మేము కొద్దిమందిమి వాళ్ల బారి పడకుండా పారిపోయి వచ్చాం," అంటూ గగ్గోలుగా అరిచారు ప్రజలు.



ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తిపోయిన రాక్షసులు కూడా, తమ నాయకుడితో యిలాగే మొరపెట్టుకున్నారు. కాని, వాళ్లు పశువుల్ని మేపేందుకు వెళ్లిన రాక్షసులు కాదు. దొంగతనంగా వాటిని ఎత్తుకు పోయేందుకు వెళ్లినవాళ్లు. పులిరాయుళ్లు అదే సమయానికి అక్కడికి రావటంతో, వాళ్ల చేతుల్లో వీళ్లు చావుదెబ్బలు తిన్నారు.

"చిత్రసేనా! మనం పశువుల కాపర్లకు రక్షణగా వెళదామంటావా?" అని అడిగాడు ఉగ్రాక్షుడు నిరుత్సాహంగా.

"వెళ్లక చేసేదేమిటి? ప్రజలను ఆ దుర్మార్గులు హింసిస్తూ వుంటే, చూస్తూ వూరుకుంటామా?" అని అడిగాడు చిత్రసేనుడు కోపంగా.

ఆ వెంటనే చిత్రసేనుడు జడలమర్రి ప్రాంతానికి బయలుదేరాడు. ఉగ్రాక్షుడు ముఖంలో లేని గాంభీర్యాన్ని కనబరుస్తూ, "ఊఁ పదండి! ఆ క్రూరుల్ని చిత్రవధ చేస్తాను," అంటూ అతడి వెనకగా నడిచాడు.

అందరూ కొంతదూరం చెట్లలో నడిచిన తరవాత, అమరపాలుడు ముందుకు వచ్చి, చిత్రసేనుడితో, "మహారాజా, నాదొక మనవి! ఈసరికే పులిరాయుళ్లు తమ పని ముగించుకుని వెళ్లిపోయివుంటారు. అలా కాక, వాళ్లింకా అక్కడ వున్నప్పటికీ, మనం వాళ్లను ఏమీ చేయలేం. ఆ భయంకర పక్షులు వెంట వుండగా, వాళ్లను ఎదుర్కొనటం ఆత్మహత్యతో సమం అవుతుంది," అన్నాడు.

ఉగ్రాక్షుడు యిందుకు అవునన్నట్టు తల ఊపుతూ, "చిత్రసేనా, ఈ అమరపాలుడు చెప్పేదాంట్లో చాలా నిజం వున్నది. మనం తొందరపడకూడదు. రాత్రి జరిగిన అనుభవం గుర్తుందికదా!" అన్నాడు.

వాళ్లిద్దరూ అలా చెప్పింతరవాత చిత్రసేనుడికి కూడా, తను చేయబోతున్నది కేవలం దుస్సాహసమన్న అనుమానం





కలిగింది. అనవసరంగా తన అనుచరులూ, కొందరు రాక్షసులూ ప్రాణాలు వదలటం తప్ప, జ్వాలాద్వీపవాసులతో పోరుపెట్టుకుని తను చేయగలిగిందేమీ లేదని అతడు గ్రహించాడు. అయితే, తను రాజయివుండి, తన పౌరులకు రక్షణ కలిగించలేని నిస్సహాయ స్థితిలో యింకెంత కాలం రాజ్య పరిపాలన చెయ్యగలడు? తన తండ్రిగారి రాజ్యంమీద దాడి వెడలిన నాగవర్మ, అక్కడ విజయం సాధించగానే, తన నగరం మీద వచ్చి పడకుండా వూరుకుంటాడా?

ఇలాంటి సంశయాలతో, భయాలతో చిత్రసేనుడు సతమతమవుతూండగా, అమరపాలుడు, "మహారాజా! నేను మీకు నమ్మిన సేవకుణ్ణి. దూకమంటే అగ్నిలో అయినా దూకుతాను. కనుక, నా మాట నమ్మండి. మనం ముందుగా కపిలపురం అడవిలో స్థావరాలు ఏర్పరుచుకున్న భయంకర పక్షుల్ని కపటోపాయం ప్రయోగించి సర్వ నాశనం చేయాలి. అప్పుడు, ఈ పులిరాయుళ్ళను హతమార్చటం ఏమంత కష్టం కాదు," అన్నాడు.

"అక్కడ దాదాపు నూరు భయంకర పక్షులున్నవంటున్నావ్! వాటిని మనం ఎలా చంపగలం?" అన్నాడు చిత్రసేనుడు.

"ఆ పక్షుల్ని చంపేందుకు ఒక సులువైన ఉపాయం వుంది మహారాజా!" అన్నాడు అమరపాలుడు.

"ఏమిటదీ?" అన్నాడు చిత్రసేనుడు.

ఈ సంభాషణ శ్రద్ధగా ఆలకిస్తున్న ఉగ్రాక్షుడికిక్కూడా, ఆ ఉపాయం ఏమిటో వినాలన్న కుతూహలం కలిగి, "ఏమిటా ఉపాయం అమరపాలా?" అన్నాడు ఎంతో ఆతృతగా.

అమరపాలుడు కోపంగా ఉగ్రాక్షుడికేసి ఓమారు చూసి, తరవాత చిత్రసేనుడితో, "మహారాజా! కపిలపురం దగ్గిరవున్న అడవిలో, భయంకర పక్షులు కొన్ని వున్నవని



చెప్పానుగదా. అవి పెద్దపెద్ద కొట్టాలలో, కాళ్ళకు బలమైన గొలుసులతో బంధించబడి కట్టుకొయ్యలకు కట్టివేయబడి వుంటవి. వాటిని సవారికి వుపయోగించే రౌతులు ఆ దగ్గరలో వున్న గుడిసెలలో వుంటారు. ఆ పక్షులను కొట్టాలలో వుండగానే మనం చంపివేయాలి," అన్నాడు.

"బాగానే వుంది. కాని, చంపటం ఎలా అన్నదే సమస్య!" అన్నాడు చిత్రసేనుడు నిరుత్సాహంగా.

"మహారాజా! ఇందుకు ఒక ఉపాయం నేను ఆలోచించి వుంచాను. వాటిని..." అంటూ అమరపాలుడు చిత్రసేనుడితో



మెల్లిగా ఏమో చెప్పబోయేంతలో, ఎదురుగా వున్న చెట్ల చాటునుంచి పెద్ద కోలాహలం వినబడింది. చిత్రసేనుడూ, ఉగ్రాక్షుడూ— వాళ్ళ అనుచరులూ అటుకేసి పరిగెత్తారు. వాళ్లు చెట్లగుంపును చేరి, కొమ్మల చాటుగా నిలబడి ముందుకు చూసేసరికి, ఒకానొక భీభత్స దృశ్యం వాళ్ల కంటబడింది.

కొన్ని భయంకర పక్షులు, గొర్రెలనూ, ఆవులనూ గోళ్ళతో పట్టుకుని, కోడిపిల్లలను తన్నుకుపోయే గద్దలలాగా ఆకాశంలోకి లేస్తున్నవి. పులిచర్మాలు ధరించినవాళ్లు వాటి రెక్కలమీద వుండి పెద్దగా కేకలు పెడుతూ, పారిపోతున్న పశులకాపరుల మీదికి శూలాలను విసిరివేస్తున్నారు. ఒక్కొక్క పులిచర్మంగాడి దగ్గిరా ఒక మోపెడు శూలాలు వున్నవి. పశులకాపర్లలో తెగించినవాళ్ళు కొందరు నిలబడి, వడిసెలలతో వాళ్ళమీదికి రాళ్లు విసురుతున్నారు. పశువులు అన్ని వైపులకూ చెల్లాచెదరుగా పారిపోతున్నవి.

ఈ భయంకర దృశ్యం చూసి చిత్రసేనుడు నిలువెల్లా కంపించిపోయాడు. ఉగ్రాక్షుడు క్రోధంతో ఒక్కసారి ఒళ్లు విదిలించుకుని, రాతి గదను బలంగా భూమికి తాటించి, గర్జించబోయేంతలో, చిత్రసేనుడు అతణ్ణి వారిస్తూ, "అంతా అయి





పోయింతరవాత, ఇప్పుడు మళ్లీ ఆ క్రూరులు మనమీద వచ్చిపడేలా నువ్వు అరిచి లాభం లేదు. మనం యిప్పుడు చేయగలిగిందల్లా, గాయపడిన పశుల కాపర్లను కట్లుకట్టి ఇళ్లకు చేర్చటమే," అన్నాడు.

చిత్రసేనుడు యిలా అనగానే, ఆతడి అనుచరులూ, కొందరు రాక్షసులూ ముందుకు వెళ్లబోయారు. కాని, చిత్రసేనుడు వాళ్లను ఆపి, "ముందు ఆ దుర్మార్గుల్ని యిక్కణ్ణించి వెళ్లిపోనీయండి," అన్నాడు.

చూస్తూండగానే జ్వాలాద్వీపవాసులు తమ వాహనాలమీద ఆకాశంలోకి ఎగిరిపోయారు. వాళ్లు దూరంగా కనబడకుండా పోయినంతవరకూ ఆగి, తరవాత రాక్షసులూ, చిత్రసేనుడి అనుచరులూ గాయపడ్డవాళ్లకు కట్లు కట్టసాగారు. ఉగ్రాక్షుడు నీరసంగా ఒక చెట్టుబోదెకు జేరగిలపడి, "చిత్రసేనా! నాకు ఏనాడూ లేనిది ఎందుకనో కాస్త భీతి కలుగుతున్నది. మన రాజ్యానికి ఈ మహమ్మారిగాళ్ల పీడ విరగడ అయే మార్గమేదో ఆలోచించాలి," అన్నాడు.

చిత్రసేనుడు, అమరపాలుడికేసి తిరిగి, "అమరపాలా! జ్వాలాద్వీపవాసుల్నీ, వాళ్ల భయంకర పక్షుల్నీ సర్వనాశనం చేసేందుకు ఏదో ఉపాయం వున్నదన్నావు. ఏమిటది?" అని అడిగాడు.

"ఆ భయంకర పక్షుల్ని, అవి కట్టివేయబడివుండే కొట్టాల్లోనే నాశనం చేయాలి. అందుకు ఒకటే మార్గం, అవి వుండే కొటాలకు నిప్పు పెట్టటమే," అన్నాడు.

"అది సాధ్యం అయే పనేనా?" అని అడిగాడు చిత్రసేనుడు.

"ఎందుకు సాధ్యం కాదు మహారాజా! నావెంట నలుగురైదుగురు సైనికుల్ని పంపండి. నేను కపిలపురం అడవుల్లోకి వెళ్లి, కావలిగాళ్లను హతమార్చి, ఆ భయంకర పక్షుల్ని నిలువునా దహించేస్తాను," అన్నాడు. —(ఇంకా వుంది)



# అతితెలివి

ఒక ఆసామి తన పొరుగు ఆసామివద్ద ఒక కుండ అరువుతీసుకున్నాడు. అందులో వెన్న కాచుదామని అతను నిప్పుచేస్తూండగా ఎక్కడినుంచో పిల్లి వచ్చి కుండపైన కాళ్లుపెట్టి లేచి నిలబడింది. అదిచూసి అతను పిల్లిని తరమబోయాడు. పిల్లి వెనక్కు దూకింది, కుండ అరుగుమీదినుంచి కిందపడి రెండే రెండు ముక్కలయింది.

కుండ అరువు తెచ్చినవాడు తడుముకోకుండా రెండుముక్కలూ జిగురుపెట్టి అంటించి, పొరుగువాడివద్దకు తీసుకుపోయి, "ఇదుగో నీ కుండ," అని ఇచ్చేశాడు. పొరుగువాడు పగులు గమనించి, "ఏమిటిది?" అన్నాడు. ఆసామి, "నాకు తెలియదు," అంటూ ఇంటికి వచ్చాడు.

పొరుగువాడు కోర్టులో ఫిర్యాదు చేశాడు. ఆసామి ప్లీడరువద్దకు వెళ్లి సలహా అడిగాడు. ప్లీడరు అంతా విని, "జరిగినదానికి సాక్షులెవరూ లేరుగనక నువ్వు మూడువిధాలుగా సమర్థించుకోవచ్చు. నువ్వు కుండ అరువు తీసుకున్నప్పుడే అది పగిలి ఉన్నదనవచ్చు; లేదా, నువ్వు దానిని తిరిగి ఇచ్చాక పగిలిందేమోననవచ్చు; అన్నిటికన్నా శ్రేష్ఠమైనదేమంటే, అసలు నువ్వు కుండ తీసుకోలేదనవచ్చు," అన్నాడు.

కుండ ఖరీదు పావలా అయినా మంచి సలహా చెప్పినందుకు ప్లీడరుకు రూపాయి యిచ్చి ఆసామి ఇంటికి వచ్చాడు.

మర్నాడు కోర్టులో విచారణ. ఆసామి జడ్జిగారితో ఇలా విన్నవించుకున్నాడు: "అయ్యా, నేనాకుండ తీసుకున్నప్పుడే అది పగిలి ఉన్నదండి. ఆమాటకు వస్తే అది నేను ఇచ్చినాక పగిలిందేమో నాకా సంగతి తెలియదండి. అన్నిటికన్న ముఖ్యమేమంటే నేనసలు ఆ కుండను అరువు తీసుకోనే లేదండి!"

ప్లీడరు సలహా ఇంత బాగా పాటించినా న్యాయాధికారి తనకు రెండు రూపాయలు జరిమానా ఎందుకు వేశాడో ఆసామికి అర్థంకాలేదు. ఆయన డబ్బు చెల్లించి ప్లీడర్లను తిట్టుకుంటూ ఇంటికి వెళ్లాడు.





# బాలచరిత్ర

అర్ధరాత్రివేళ, మధురానగరంలో అందరూ నిద్రలో మునిగిఉండగా కారాగృహంలో దేవకి ఒక మగబిడ్డను కన్నది. దేవతలు పుష్పవర్షం కురియించారు. కలహప్రియుడైన నారదమహాముని వచ్చి, ఆ బాలుడి చుట్టూ ప్రదక్షిణ చేసి వెళ్లిపోయాడు.

తన బిడ్డను పక్కలో పెట్టుకుని పడుకుని ఉన్న దేవకికి అనేక శుభలక్షణాలు కనిపించాయి: పెద్ద ఝంఝామారుతంతోబాటు ఆకాశాన కళ్లు చెదిరే మెరుపులు మెరిశాయి, భూమి కంపించింది. కాని కంసుడి బుద్ధి తెలిసినది కావటంచేత ఆమె ఈ నిమిత్తాలు చూసి సంతోషించ లేకపోయింది.

వసుదేవుడు ఆమెవద్దకు వచ్చి శిశువును చూసి ఆనందించి, "బిడ్డను ఇచ్చెయ్యి, ఎక్కడికైనా తీసుకుపోతాను," అన్నాడు.

"అయ్యో, బిడ్డను తనివిదీర చూసుకోనివ్వండి," అన్నది దేవకి.

"నీకు తనివితీరేలోగా మృత్యువు కంసుడి రూపంలో రానేవస్తుంది," అన్నాడు వసుదేవుడు. విధిలేక ఆ బిడ్డను తన భర్త చేతికి అందించింది. బిడ్డ బరువు చూసి వసుదేవుడు నివ్వెరపోయాడు. ఆయన బిడ్డను తీసుకుని బయటికి పోతుంటే కవాటాలు వాటికవే తెరుచుకున్నాయి. కాపలావాళ్ళు గాఢనిద్రలో ఉన్నారు.

వసుదేవుడు మధురానగరం దాటి పోతున్నాడు. కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి, ఆకాశమంతా కాటుక పులిమినట్టున్నది. దారి కొంచెంకూడా తెలియటం లేదు. "ఈ చీకటిలో ముందుకు సాగటం నావల్ల కాదు," అని వసుదేవు డనుకునేటంతలో ఎక్కడినుంచో కాంతి పడి దారి స్పష్టంగా కనిపించింది. తాను శిశువును తీసుకుపోతున్న సంగతి తెలిసి దుర్మార్గుడైన కంసుడు తనను పట్టటానికి దివిటీలతో



మనుషులను పంపాడనుకుని వసుదేవుడు ఆత్మరక్షణకోసం కత్తిదూసి వెనక్కు తిరిగి చూశాడు, కాని ఎవరూ లేరు; దారిని వెలిగించిన కాంతి శిశువునుంచి వస్తున్నది!

ఆయన త్వరలోనే యమునను చేరుకున్నాడు. యమునానది సుడులు తిరుగుతూ పోటుగా ప్రవహిస్తున్నది. అందులో మహా సర్పాలూ, మొసళ్ళూ ఉంటాయి. అయినా భయపడి ప్రయోజనంలేదు, నది ఈది అవతలికి వెళ్ళవలిసిందే. ఇలా అనుకుంటూ ఆయన నదిలో కాలు పెట్టగానే అలలు విడిపోయి దారి ఇచ్చాయి.

వసుదేవుడు శిశువుతోసహా అవతలిఒడ్డు చేరి ఒక మర్రిచెట్టు కిందికి వచ్చాడు. ఆ సమీపంలోనే ఆయన మిత్రుడైన నందగోపుడుండే పల్లె ఉన్నది. కంసుడు ఆజ్ఞాపించగా ఆయన, పాపం, ఆ నందగోపుణ్ణి కొట్టి, సంకెళ్ళు కూడా వేశారు. తన బిడ్డను నందగోపుడి సంరక్షణలో ఉంచితే బాగుండుననుకున్నాడు వసుదేవుడు.

ఆ సమయానికే చచ్చిన ఆడ శిశువును తీసుకుని సంకెళ్ళతోసహా నందగోపుడు అక్కడికి వచ్చాడు. జరిగినదేమంటే అంతకుముందే నందగోపుడి భార్య అయిన యశోద ఈ ఆడశిశువును ప్రసవించి స్పృహ తప్పిన స్థితిలో ఉండిపోయింది. తాను కన్న బిడ్డ మగబిడ్డో, ఆడబిడ్డోకూడా ఆమె ఎరగదు. ఈ శిశువేమో పుడుతూనే చనిపోయింది. మర్నాడు పల్లెలో ఇంద్రయజ్ఞమనే ఉత్సవం జరగబోతున్నది. నందగోపుడికి బిడ్డ పుట్టి చనిపోయిందంటే పల్లెలోవారంతా విచారపడి ఉత్సవం జరుపుకోలేకపోతారు. అందుకని నందగోపుడు చచ్చిపోయిన శిశువును పారవేయటానికి చీకటిలో పడి యమునా తీరానికి వచ్చాడు.

నందగోపుడు తనలోతాను గొణుక్కుంటూ ఉండటం వినబడి వసుదేవుడు, "ఎవరది? నా స్నేహితుడు నందగోపుడేనా?" అని



పిలిచాడు. భూతాలో, పిశాచాలో తనను పిలుస్తున్నా యనుకుని మొదట నందగోపుడు భయపడ్డాడు; తరవాత గొంతు గుర్తించి, "వసుదేవుడు బాబు! అయినా ఆయనతో నాకేమిటి? కంసుడు కొట్టమంటె నన్ను కొట్టాడు, నాకీ సంకెళ్ళు తగిలించాడు!...ఛీ ఛీ! ఇంత కఠినుణ్ణి అయిపోతున్నానేమిటి! రాజాజ్ఞ ధిక్కరించలేక నన్ను శిక్షించాడేగాని నాకు ఎన్నివేలసార్లు ఉపకారం చేశాడుకాడు?" అనుకుంటూ వసుదేవుణ్ణి సమీపించాడు.

"నందగోపా, క్షేమంగా ఉన్నావా? అందరూ కులాసాగా ఉన్నారా?" అని వసుదేవు డడిగాడు. నందగోపుడు వసుదేవుడికి ప్రణామం చేసి తన భార్య ఆడశిశువును కన్న సంగతి, ఆ శిశువు పుడుతూనే చనిపోయిన సంగతి, మర్నాడు జరుగనున్న ఇంద్రోత్సవానికి విఘాతం కాకుండా తాను శిశువును పారవేయవచ్చిన సంగతి తెలిపాడు.

వసుదేవుడు తాను తెచ్చిన శిశువును గురించి చెప్పి, "ఇప్పటికే కంసుడు నా బిడ్డలను ఆరుగురిని చంపాడు. వీడు ఏడవవాడు. నా శిశువును తీసుకుపోయి, నీయింట పెంచు," అన్నాడు.

"అమ్మో బాబో! ఈ సంగతి కంసరాజుకు తెలిస్తే నా బుర్ర ఎగిరిపోదా?" అన్నాడు నందగోపుడు, కాని మరుక్షణమే వసుదేవుడు కోరినట్టు చెయ్యటానికి ఒప్పుకున్నాడు.

అయితే చచ్చిపోయిన శిశువును చేతిలో ఉంచుకుని తాను మైలపడి ఉన్నాననీ, స్నానం చేస్తేగాని వసుదేవుడి శిశువును తాకటానికి లేదనీ అతడికి తోచింది. అంతలోనే పాతాళగంగ పైకి వచ్చి అతనికి స్నానం చేయించింది. తరవాత నందగోపుడు వసుదేవుడి బిడ్డను చేత పట్టుకుని, "ఎంత బరువో!" అన్నాడు.

ఇంతలో విష్ణువు పరిచారకులైన గరుత్మంతుడూ, శంఖమూ, చక్రమూ, శార్ఙమూ,

కౌమోదకీ మొదలైనవి వచ్చి బాలుడికి ప్రణామాలు చేశాయి. నందగోపుడుకూడా ప్రణామంచేశాడు. వెంటనే చిత్రంగా అతని సంకెళ్ళు రాలిపోయాయి.

"నందగోపా, నా కొడుకును ఎలా పెంచు తావో!" అన్నాడు వసుదేవుడు.

"బాబూ, మీవాడు మా పల్లెకు ప్రభువే అనుకోండి. ఏ ఇంటికి పోయినా పెరుగో, పాలో, వెన్నో, మజ్జిగో తప్పక ఇస్తారు," అన్నాడు నందగోపుడు.

తరవాత ఇద్దరూ వచ్చిన దారి పట్టారు. మథురకు తిరిగిపోయే వసుదేవుడికి చంటి బిడ్డ ఏడుపు వినిపించింది. తీరాచూస్తే నందగోపుడి కుమార్తె తిరిగి ప్రాణంవచ్చి ఏడుస్తున్నది! వసుదేవుడికి ఒక ఆలోచన కలిగింది: ఈ బిడ్డను తీసుకుపోయి దేవకి పక్కలో పడుకోబెట్టి కంసుణ్ణి మోసగించవచ్చు! ఆయన ఆ బిడ్డను ఎత్తుకుని మథురకు వచ్చేశాడు.

* * *

ఆ రాత్రి రాజగృహంలో కంసుడు నిద్రపోతూ పీడకలలు కంటున్నాడు. రాజహర్మ్యాలు కూలిపోతున్నాయి, భూమి తుఫానులో చిక్కిన ఓడలాగా కొట్టుకుంటున్నది. నల్లని కాటుకరంగుగల మాతంగస్త్రీలు తమను పెళ్ళాడమంటూ కంసుణ్ణి చుట్టు





ముట్టారు. అతను వారిని కసిరికొట్టాడు. ఇంతలో ఒక భీకరాకారం వచ్చి, "కంసా! నేను మధూక మహాముని శాపాన్ని. నీలో ప్రవేశించబోతున్నాను. నీ మంచిరోజులు అయిపోయాయి," అన్నది. ఆ శాపం కంసుడి అదృష్టదేవతను పిలిచి, "ఇక నీ కిక్కడ తావులేదు, వెళ్లిపో!" అని చెప్పింది.

కంసుడు నిద్రలేచి యశోధర అనే ప్రతిహారిని పిలిచి, "ఇప్పుడు మాతంగస్త్రీలు లోపలికి వచ్చారా?" అని అడిగాడు. లేదన్నది ప్రతిహారి. కంసుడు బాలాకి అనే కంచుకిని పిలిపించి, "ఈ భూకంపాలకూ, ఉల్కాపాతాలకూ, మారుతాలకూ కారణం ఏమిటో సాంవత్సరిక పురోహితుణ్ణి అడిగి తెలుసుకురా," అని పంపాడు.

బాలాకి తిరిగివచ్చి, "మహారాజా, ఈ రాత్రి అదిదేవుడు భూమిపైకి అవతరించాడని పురోహితుడు చెబుతున్నాడు," అన్నాడు. "అదిదేవుడు ఎవరి కొడుకుగా పుట్టాడో, ఎందుకై పుట్టాడో కూడా అడిగిరా," అన్నాడు కంసుడు. బాలాకి సరేనని వెళ్ళి అంతలోనే తిరిగివచ్చి, "మహారాజా, దేవకీదేవి స్త్రీ శిశువును ప్రసవించింది," అని చెప్పాడు. కంసుడు ఈ మాట నమ్మక, వసుదేవుడైతే నిజం చెబుతాడని, ఆయనను పిలిపించి అడిగాడు. ప్రాణాన్ని రక్షించటానికి చెప్పే అబద్ధం నిజంతో సమానమనుకుని వసుదేవుడు తన భార్య ఆడ శిశువును ప్రసవించినట్టు చెప్పాడు.

ఆడదైతేనేం, మగవాడైతేనేం చచ్చి తీరవలిసిందే నన్నాడు కంసుడు. ఎవరెంత చెప్పినా లాభం లేకపోయింది. "అయ్యో, మరొకరి బిడ్డను ఎలా చావనిచ్చేది? నా కొడుకును మళ్లీ తీసుకురానా?" అనుకున్నాడు వసుదేవుడు. కాని ఈ బిడ్డ ఒకప్పుడు చనిపోయి బతికినదేననీ, దానికి హాని కలగదనీ తనకు తాను సమాధానం చెప్పుకుని దేవకిని ఊరడించటానికి వెళ్ళాడు.

కంసుడు దేవకి వద్దనుంచి బిడ్డను తెప్పించాడు. ఆ బిడ్డలో గల శుభలక్షణాలు చూసి అతనికే చంపబుద్ధి కాలేదు. కాని దేవకి ఏడవ గర్భం తన ప్రాణం తీస్తుందని ముని శాపం పెట్టాడు; ఈ బిడ్డ చస్తేగాని తనకు మనశ్శాంతి లేదు. అతను ఆ బిడ్డను కంస శిలకేసి విసిరికొట్టాడు.

మరుక్షణమే సపరివారంగా కాత్యాయని ప్రత్యక్షమై, "ఓరీ, కంసా, నిన్ను నాశనం చెయ్యటానికే నేను వసుదేవుడి వంశంలో అవతరించానురా!" అని వెళ్ళిపోయింది.

తెల్లవార వస్తున్నది. కంసుడు తనకు రాగల అశుభాలకు విరుగుడుగా శాంతి చేసుకోవటానికి ఉపక్రమించాడు.

*        *        *

నందగోపుడి ఇంట కృష్ణుడు జన్మించిన నాటినుండి గోవులకూ, గోపాలకులకూ జీవితం ఆనందమయంగా ఉన్నది. బృందావనం కళకళలాడుతున్నది. కందమూలాలూ, పాలూ, పెరుగూ సర్వ సమృద్ధిగా ఉన్నాయి.

గోపాలకులు కృష్ణుణ్ణి గురించి కథలు చెప్పుకునేవారు. అతడు పదిరోజుల పిల్లవాడై ఉండగా తనను చంపవచ్చిన పూతన వద్ద పాలు తాగేసరికి ఆ దుర్మార్గురాలు



కాస్తా చచ్చిపోయింది. నెలరోజులవాడై ఉండగా శకటాసురుణ్ణి చంపేశాడు. చుట్టుపక్కల ఇళ్ళలో పాలూ, వెన్నా దొంగిలించాడని యశోద రోటికి కట్టేస్తే, ఆ రోటిని రెండు చెట్ల మధ్యగా ఈడ్చుకుపోయి వాటిని కాస్తా ధ్వంసం చేశాడు. అయితే ఆ వృక్షాలలో యమలార్జునులనే రాక్షసులు దాగిఉండి, వాటితోపాటే నశించారు.

ఇంకొకసారి బలరాముణ్ణి ప్రలంబుడనే రాక్షసుడు నందగోపుడి వేషంలో వచ్చి ఎత్తుకు పోసాగాడు. బలరాముడు మోసం గ్రహించి ఒక్క గుద్దుతో వాడి కళ్లు ఊడిపడేలాగ కొట్టి చంపేశాడు. ఇంకొకసారి

తాటితోపులో ధేనుకుడనే రాక్షసుడు గాడిద రూపంలో వస్తే కృష్ణుడు వాడి ఎడమకాలు పట్టుకుని విసిరికొట్టి చంపాడు. అలాగే గుర్రం రూపంలో వచ్చిన కేసి అనే రాక్షసుడి నోట కర్పూరం పెట్టేసరికి వాడు రెండుగా చీలి చచ్చాడు.

ఒకనాడు గోపకులూ గోపికలూ ఆనందంగా నృత్యాలు చేస్తుంటే అరిష్ట వృషభం వచ్చి భీభత్సం చేసింది. కృష్ణుడు దాన్ని ఎదిరించి, దానితో యుద్ధం చేసి చంపేశాడు. ఇంతలో కొందరు గోపాలకులు వచ్చి, బలరాముడు కాళియుడితో యుద్ధం చెయ్యటానికి వెళ్లాడని కృష్ణుడితో చెప్పారు.

కాళియుడి మదం అణచటానికి కృష్ణుడు యమునానదిలో కాళియుడుండే మడుగు వద్దకు వెళ్లాడు. మడుగులోకి దిగవద్దని అతన్ని గోపికలు వేడుకున్నారు. భయం లేదని చెప్పి కృష్ణుడు మడుగులోకి దిగాడు. ఒడ్డున ఉన్న గోపాలకులలో ఒక వృద్ధుడు, "అయ్యయ్యో! నీరు తాగటానికి ఆ మడుగులో ప్రవేశించిన పులులూ, అడవి పందులూ, ఏనుగులూ మరి కనిపించలేదు. అందులోకి పోవద్దు!" అని కేకలు పెట్టాడు.

కృష్ణుడు కాళియుణ్ణి పట్టుకుని అతడి అయిదు శిరస్సులను కాళ్లతో తొక్కుతూ లొంగదీసుకున్నాడు. కాళియుడు కృష్ణుణ్ణి



శరము వేడుకుని మడుగు విడిచిపోవటానికి సమ్మతించాడు. "నీ శిరస్సుపై నాకాళ్ల గుర్తులు చూసి గరుత్మంతుడు నీ జోలికి రాడు, వెళ్లు," అన్నాడు కృష్ణుడు.

ఇంతలోనే ఒక భటుడు వచ్చి, మధురా నగరంలో కంసమహారాజు ధనుర్మహమనే ఉత్సవం చేస్తున్నారనీ, దానికి కృష్ణ బల రాములను ఆహ్వానిస్తున్నారనీ చెప్పాడు.

మధురలో కంసుడు కృష్ణ బలరాముల రాకకోసం ఎదురుచూస్తున్నాడు. వారు చాలా గొప్ప బలపరాక్రములని విని వారిని నాశనం చేయటానికి ఆయన అన్ని ఏర్పాటులూ చేయించాడు.

కృష్ణ బలరాములు మధురకు వచ్చారు. వారు రాజుగారి చాకలివాళ్ళ దగ్గిర బట్టలు లాక్కున్నారు. వారిని తొక్కి చంపటానికి మంత్రి ఒక ఏనుగును పంపితే కృష్ణుడు దాని దంతాలు ఊడబెరికి వాటితోనే దాన్ని మోది చంపాడు. దారిలో మదనిక అనే కుబ్జ కనిపించింది. దానివద్ద వున్న అగురు గంధాలు కృష్ణుడు తీసుకుని తన ఒంటికి రాచుకున్నాడు. తరవాత అతను దాని శరీరాన్ని తన చేతులతో నిమిరేసరికి మదనిక తన కుబ్జత్వాన్ని పోగొట్టుకుని మామూలు మనిషి అయింది. కృష్ణుడు పూలమాలలు తీసుకుని తన మెడలో వేసుకుని ధనుశ్శాల



లోకి వెళ్ళాడు. దానికి రక్షకుడైన సింహబలుడనేవాడు అడ్డువస్తే వాణ్ణి చంపేసి, బాణాల్ని రెండు ముక్కలుగా విరిచేశాడు. అక్కడినుంచి అతను సభాభవనానికి బయలుదేరాడు. ఈ సంగతులన్నీ కంసుడికి తెలియవచ్చాయి. బలరామ కృష్ణులను చంపటానికి ఆయన చాణూర ముష్టికులనే మల్లులను సిద్ధంగా ఉంచాడు.

బలరామ కృష్ణులు వచ్చారు. భటుడు వారితో, "వారే మహారాజులవారు, ప్రణామం చెయ్యండి," అన్నాడు. "ఎవరికి మహారాజు?" అని వారు అడిగారు. "యావత్ప్రపంచానికీ మహారాజు," అని భటుడు చెప్పాడు. "మనం చూడం!" అన్నారు బలరామ కృష్ణులు.

కంసుడు కృష్ణుణ్ణి చూస్తూ, "ఇతనా కృష్ణుడు? బలిష్ఠమైన బాహువులూ, రొమ్మూ కలిగి, మదపుటేనుగులాగున్నాడు. నేను విన్న పనులన్నీ చేశాడంటే ఆశ్చర్యమేమీ లేదు. ప్రపంచాన్ని తల్లకిందులు చేయగలవాడే!" అనుకున్నాడు.

ఆయన అజ్ఞాపించగానే చాణూర ముష్టికులూ, కృష్ణ బలరాములూ మల్లయుద్ధానికి ఉపక్రమించారు. క్షణంలో చాణూర ముష్టికులిద్దరూ చచ్చిపోయారు. కృష్ణుడు సింహాసనంమీదికి లంఘించి, "ఈ కంసుణ్ణి ఇప్పుడే యమలోకానికి పంపుతాను," అంటూ కంసుడి తల పట్టుకుని కిందికి విసిరాడు. కంసుడు చచ్చి పడిపోయాడు.

ఇదిచూసి కంసుడి పరివారం బలరామ కృష్ణులపైకి రావటానికి ఉద్యమించారు. బలరామ కృష్ణులు వారిని ఎదుర్కొనటానికి కూడా సిద్ధపడ్డారు. అయితే వసుదేవుడు వారితో, "వీరిద్దరూ నా కుమారులే. వీడు రోహిణీపుత్రుడు, వీడు దేవకీపుత్రుడు. వీరినేమీ చేయకండి," అని హెచ్చరించాడు. ఆయన చెరలో ఉన్న ఉగ్రసేన మహారాజును చెర విడిపించి పట్టాభిషేకం జరిపించాడు.





# అదృష్టం

కై పెంగ్ రాజధానిలో చిన్ అనే వర్తకుడొక డుండేవాడు. అతను ఉదయం పెందలాడే లేచి రాత్రి పొద్దు పోయినదాకా ధనార్జన కోసమే పాటుపడేవాడు. ఈ విధంగా శ్రమించి తగినంత డబ్బు కూడబెట్టినాక అతను తాను కూడబెట్టినది భద్రంగా ఉంచు కోవటానికిగాను ఒక ఉపాయం చేశాడు. తనవద్ద ఉన్న చిల్లర నాణాలు ఖర్చుకు ఉంచుకుని కల్తీ లేని వెండి యావత్తూ కరిగించి మూడేసి వీశల వెండికి ఒక్కొక్కటి చొప్పున అచ్చులు పోయించుకున్నాడు.

ఇలా ఏళ్ల తరబడి అతను నిలవచేసిన వెండి ఎనిమిది అచ్చులయింది. అంతకు మించి వెండి పోగుచెయ్యటం చిన్‌కు సాధ్యం కాలేదు; ఎందుకంటే, ఆ తరవాత రాబడి ఎంతో ఖర్చుకూడా అంతా ఉంటూవచ్చింది. ఈ ఎనిమిది వెండి అచ్చులనూ ఎర్ర తాళ్లతో కట్టి తన తలదిండు పక్కనే పెట్టు కునేవాడు చిన్; రాత్రి నిద్రపోయేముందు వాటిని తన చేత్తో తడివి చూసుకుని సంతోషించేవాడు.

చిన్‌కు నలుగురు కొడుకులుండేవారు. వాళ్లు తమ తండ్రి డెబ్బయ్యోవ జన్మదినం నాడు పెద్ద విందు చేసి ఆయనకు ఎంతో గౌరవం చూపారు. ఆయన వారిని చూసి ఎంతో ప్రేమతో, "నాయనలారా, నేను నా జీవితమంతా ఎంతో కష్టపడి మనకు లోటు లేకుండా సంపాదించాను. నేను పోగు చేసినదంతా ఎనిమిది పెద్ద వెండి అచ్చుల రూపంలో ఉన్నది. రెండేసి అచ్చులను ఒక్కొక్క ఎర్రతాడుతో కట్టి నాలుగు కట్టలు సిద్ధంగా ఉంచాను. మంచిరోజు చూసి మీ నలుగురికీ నాలుగు కట్టలనూ ఇస్తాను. వాటిని పోగొట్టుకోకుండా యావజ్జీవమూ మీ దగ్గిర ఉంచుకోండి!" అన్నాడు. చిన్ కొడుకులు పరమానందభరితులయారు.

చీనాదేశపు జానపదకథ



చిన్ ఆ రాత్రి తన పక్కమీద పడుకుని తన తలకు సమీపంగా ఉన్న ఎనిమిది వెండి అచ్చులనూ చేతితో తడివి చూసుకుని తనలోతాను నవ్వుకుని, కళ్ళు మూసి నిద్రలో పడ్డాడు. ఇంతలో గదిలో అలికిడి అయింది. గదిలో మనుషులు మసులుతున్నట్టు తోచి, చిన్ తన మంచానికి గల తెరలు తొలగించి చూశాడు. గదిలో దీపం వెలుగుతూనే ఉన్నది. దాని వెలుగులో చిన్‌కు ఎనిమిది మంది అజానుబాహులు కనిపించారు. వారు తెల్లని దుస్తులూ, నడుములకు ఎర్రని కాసెలూ కలిగిఉన్నారు. చిన్‌ను చూసి వారు సమీపంగా వచ్చి, వంగి దణ్ణాలు పెట్టి, "బాబూ, మేం అన్నదమ్ములం. మిమ్మల్ని కొలవమని దేవుడు మమ్మల్ని పంపాడు. ఇంతకాలమూ మీరు మాచేత ఏపనీ చేయించుకోకుండా మమ్మల్ని దగ్గిర పెట్టుకుని ఎంతో ఆదరించారు. మీకాలం ముగియబోతున్నది. ఆఖరు క్షణందాకా మీ వెంటనే ఉందామనుకున్నాం గాని, మమ్మల్ని మీరు మీ కొడుకుల పరం చేయబోతున్నట్టుగా తెలియవచ్చింది. అయితే మాకు వారి సేవ చేసే యోగం లేనందువల్ల తమకు వీడ్కోలు చెప్పి వెళ్ళిపోవచ్చాం. మేము ఈ సమీపంలో ఉండే ఫలాని గ్రామంలో వాంగ్ అనే ఆయనవద్ద కొలువు చెయ్యబోతున్నాం. మళ్ళీ మనం ఒక్క పర్యాయం కలుసుకుంటాంలెండి!" అంటూ, వెనక్కు తిరిగి వెళ్ళిపోయారు.

ముసలి చిన్ సంభ్రమాశ్చర్యాలతో మంచం మీదినుంచి కిందికి దూకాడు, వెళ్ళిపోతున్న ఆ ఎనిమిదిమందినీ వెంబడించాడు. ఆ తొందరలో ఆయన ఏదో అడ్డు తగిలి పడిపోయాడు. మళ్ళీ కళ్ళు తెరిచేసరికి ఆయన తన మంచం మీదనే పడుకుని ఉన్నాడు. తాను అంతకుముందు చూసినదంతా కలమాత్రమేనని ఆయనకు తెలిసిపోయింది.

చిన్ మంచంమీదినుంచి దిగి దీపం పెద్దదిచేసి వచ్చి తన దిండుపక్కన తడివి చూసుకున్నాడు. వెండి అచ్చులన్నీ మాయమయాయి. తాను కలలో చూసినదీ, విన్నదీ వివరంగా జ్ఞాపకంచేసుకుని, ఆ కల నిజమయిందనుకున్నాడు. తన కష్టార్జితం తన కొడుకులకు గాక ఎవరో పరాయివాళ్ళకు పోవటం అయనకు విచారం కలిగించింది. అయినా ఈ వాంగ్ అనేవాడు ఫలాని గ్రామంలో ఉంటాడని తెలుసుగనక విచారింతామనుకున్నాడు.

చిన్‌కు ఆ రాత్రి మరి నిద్రపట్టలేదు. తెల్లవారుతూనే అయన ఆ గ్రామానికి వెళ్ళి వాంగ్ ఇల్లు తెలుసుకున్నాడు. వాంగ్ ఇంట ఏదో వేడుక జరుగుతున్నది. చిన్ లోపలికి వెళ్ళగానే వాంగ్ వచ్చి అతిథి మర్యాదలు చేశాడు. "ఇవాళ మీ ఇంట ఏమిటి విశేషం?" అని చిన్ వాంగ్‌ను అడిగాడు.

"మరేమీ లేదు. నా భార్య చాలా రోజులుగా జబ్బుతో తీసుకుంటున్నది. నిన్న జ్యోతిష్కుణ్ణి అడిగితే, నా భార్య పడుకునే మంచం కదిలిస్తేగాని జబ్బు నయం కాదన్నాడు. నిన్నరాత్రి నా భార్యకు కలలో ఎనిమిదిమంది జవానులు కనబడి, తాము ఇంతవరకు చిన్ అనే ఆయన వద్ద ఉండి ఇప్పుడు మా ఇంట కొలువు చేయవచ్చా





మన్నారు. తరవాత వాళ్లు నా భార్య మంచం కింద దూరారు. వెంటనే నా భార్యకు చెమటలు పట్టి వ్యాధి కాస్త నిమ్మళించింది. ఇవాళ ఆవిడ మంచం పక్కకు జరిపేసరికి దానికింద దుమ్ములో ఎనిమిది పెద్ద వెండి అచ్చులు ఎర్ర తాళ్ళతో కట్టి కనిపించాయి. అవి ఎలా వచ్చినదీ అంతుబట్టటంలేదు. అయినా భగవంతుడి దయవల్ల కలిసి వచ్చిందిగదా అని సమారాధన చేసుకుంటున్నాం!'' అన్నాడు వాంగ్.

చిన్ తన కథ యావత్తూ వాంగ్‌కు చెప్పి, ''భగవంతుడు ఇలా జరగాలని నిర్దేశించి ఉంటే నేనుమాత్రం ఏం చెయ్యగలను. కాని ఒక్కసారి ఆ వెండి అచ్చులు నన్ను చూడనిస్తారా?'' అని అడిగాడు.

వాంగ్ అచ్చులను తన నౌకర్లచేత నాలుగు పెద్ద పళ్లాలలో పెట్టి తెప్పించి చిన్‌కు చూపాడు. వాటిని చూసి ముసలి చిన్ కన్నీరు కార్చాడు.

వాంగ్‌కు ముసలివాణ్ణి చూసి జాలి కలిగింది. ఆయన పది తులాల వెండి తీసుకువచ్చి, ''ఉంచండి!'' అని చిన్‌కు ఇవ్వబోయాడు. మూడు మణుగుల వెండి పోగొట్టుకున్న దుఃఖంలో చిన్‌కు ఈ వెండి తీసుకో బుద్ధిపుట్టక నిరాకరించాడు. వాంగ్ బలాత్కారంగా దాన్ని చిన్ చొక్కాచేతిలో దోపేశాడు. చిన్ దాన్ని తిరిగి ఇవ్వాలని చొక్కాచేతిలో ఎంత తడివినా వెండి కనిపించలేదు.

చివరకు ఆయన సెలవు పుచ్చుకుని తన గ్రామం వెళ్లిపోయాడు.

తరవాత కొంతసేపటికి వాంగ్ ఇంటి నౌకర్లు ఇల్లు ఊడుస్తుంటే మండిగం కింద ఆ పది తులాల వెండి దొరికింది. చిన్ చొక్కాచేతిలో చిల్లి ఉండి, వాంగ్ ఆ వెండిని లోపలపెట్టిన మరుక్షణమే కింద పడి మండిగం దగ్గిరికి దొర్లిపోయింది.

చిన్ అదృష్టం అలా ఉన్నది!





# "ముఖే ముఖే సరస్వతీ"

సాధారణంగా గొప్పగొప్ప కవులందరూ భోజరాజును సందర్శించి, తమ కవిత్వంతో ఆయనను మెప్పించి, బహుమానాలు పొంది తిరిగి పోతూండేవారు. అయితే భోజరాజు కాలంలో ధారానగరంలో అతి సామాన్యులు సయితం గొప్పగా కవిత్వం చెప్పగలిగి ఉండేవారు. వీరిని గురించి భోజరాజుకంటె ఇతరులు బాగా ఎరుగుదురు. భోజరాజు పరిపాలనలో అందరి నోటా సరస్వతి పలుకుతుందని ప్రతీతి ఉండేది. దీన్ని భోజరాజు ప్రత్యక్షంగా చూసి ఎరగడు.

ఒకనాడు భోజరాజు అడవిలో వేటాడి గుర్రంమీద ధారానగరానికి తిరిగి వస్తూ, అలిసిపోయి దారిలో ఒక చెట్టునీడను నిలిచాడు. ఆ సమయాన ఒక గొల్లపిల్ల, నెత్తిన కుండ పెట్టుకుని ధారానగరంవేపు పోతూ కనిపించింది. తనకు దాహం తీరేదేమైనా ఆ కుండలో ఉంటుందేమోననే ఆశతో భోజరాజు, "అమ్మీ, ఆ కుండలో ఏమిటి?" అని అడిగాడు.

వెంటనే ఆ గొల్లపిల్ల భోజరాజును గుర్తించి, ఆయన తనను ఆ విధంగా ఎందు కడిగాడో గ్రహించి, ఈ విధంగా జవాబిచ్చింది:

"హిమ కుంద శశిప్రభ శంఖనిభం,
పరిపక్వ కపిత్థ సుగంధరసం,
యువతీ కరపల్లవ నిర్మథితం,
పిబ హే నృపరాజ! రుజాపహరం."

[మంచు, మల్లెలు, వెన్నెల, శంఖం వంటిది (తెల్లనైనది); వెలగపండువలె సువాసన గలది; కోమలమైన స్త్రీ చేతులతో చిలికినది; శ్రమ నివారణ చేయగలది (అయిన చల్ల); ఓ రాజేంద్రా, దాహం పుచ్చుకో!]

భోజరాజా గొల్లపిల్ల కవితాశక్తికి ఆశ్చర్యపోయి, ఆమె కుండలోని చల్ల తాగి, దాహం తీర్చుకుని, ఆమెకు తగిన బహుమానం ఇచ్చాడు.

మరొక సమయంలో భోజరాజు ఉద్యానవనానికి పోతూండగా ఆయన కొక బోయపిల్ల ఎదురయింది. ఆమె చేతిలో కొద్ది మాంసం ఉన్నది. ఆమె చాలా డస్సిపోయి, ఆకలి గొని ఉన్నట్టు కనబడింది. భోజరాజామెను పలకరించాడు. వారిద్దరికీ ఈ కింది విధంగా కవిత్వసంభాషణ జరిగింది:

భోజరాజు: కాత్వం పుత్రి? (ఎవరి అమ్మాయివి?)
బోయపిల్ల: నరేంద్ర, లుబ్ధకవధూః (రాజా, బోయ వాళ్ళ పిల్లను)
భోజరాజు: హస్తే కిమేతత్? (చేతిలో అదేమిటి?)
బోయపిల్ల: పలం (మాంసం)
భోజరాజు: క్షామం కిం? (అంత కొంచెంగా ఉందేం?)
బోయపిల్ల: ....సహజం బ్రవీమి, నృపతే!
యద్యాదరా చ్ఛ్రూయతే,
గాయన్తి త్వదరి ప్రియాశ్రుతటినీ
తీరేషు సిద్ధాంగనా
గీతాన్నాసత్తృణం చరన్తి హరిణాః
తేనామిషం దుర్లభం!

[ఓ రాజా! ఆదరంతో వినేట్టయితే ఉన్న మాట చెబుతాను. నీ శత్రువుల భార్యల కన్నీటి సెలయేళ్ళ తీరాలలో సిద్ధాంగనలు పాడే పాటలు వింటూ లేళ్ళు గడ్డికూడా మేయవు. మాంసం ఎట్లా దొరికేట్టు?]

తిండికికూడా లేని ఈ బోయపిల్ల నోట ఇంత కవిత్వం వెలువడటం చూసి ముగ్ధుడై భోజరాజు, తన ఒంటిమీద గల ఆభరణాలన్నీ ఊడ్చి ఆమె కివ్వటమే గాక, పైన చెప్పిన శ్లోకంలో ప్రతి అక్షరానికీ ఒక లక్షచొప్పున ఆమెకు బహుమతి ఇప్పించాడు.





## 3

కొండదారి కోట ఉండిన ప్రాంతం చాలా ఫలసమృద్ధి గలది. ఈ దేశం దాటటానికి ఆరు రోజులు పడుతుంది. తరవాత పెద్ద పెద్ద ఎడారులు తగిలాయి. వాటిలో కొన్ని యాభై, అరవై మైళ్ళ విస్తీర్ణం కలవి. ఎక్కడా ఒక్క చుక్క నీరు దొరకదు.

ఈ దారిలో బాల్ఖ్ అనే నగరం తగులుతుంది. ఇది ఒకప్పుడు మహానగరంగా ఉండేదట. కాని దీనిని తాతార్లూ, ఇతరులూ కొల్లగొట్టి నాశనం చేశారు. ఎన్నో గొప్పగొప్ప చలవరాతి భవనాల శిథిలాలు ఇంకా కనిపిస్తూనే ఉన్నాయి. ఈ నగరం లోనే మహా యోధుడైన అలెగ్జాండరు డేరియస్ అనే పర్షియారాజు కుమార్తెను పెళ్ళాడాడని ప్రతీతి. ఇక్కడినుంచి జన సంచారం లేని మార్గాన ఈశాన్య దిశగా పన్నెండు రోజులు ప్రయాణిస్తే తాలిఖాన్ అనే నగరం వస్తుంది. ఈ నగరానికి దక్షిణంగా ఉన్న కొండలలో ఉప్పుగనులున్నాయి. వీటిలో ప్రపంచాని కంతకూ ఎప్పటికీ సరిపడేటంత ఉప్పు ఉన్నది!

అలెగ్జాండరుకూ, డేరియస్ కుమార్తెకూ పుట్టిన సంతతివారు ఏలే దేశం పేరు బదఖ్షాన్. ఇక్కడ ఒక కొండలో కెంపులు దొరికే గనులున్నాయి, మరొక కొండలో నీల మణులు దొరుకుతాయి. ఇది సమృద్ధి అయిన ప్రాంతం. చలి జాస్తి. కొండదారులు



దుర్గమంగా ఉండటంచేత శత్రుభయం లేదు. కొండలమీది గాలి ఎంత నిర్మల మైనదంటే ఆ గాలికే అనేక వ్యాధులు నయమవుతాయి.

ఇక్కడినుంచి పామిర్ పీఠభూమికి పద్దెనిమిది రోజుల ప్రయాణం. పామిర్ ప్రపంచంలోకెల్ల ఎత్తయిన సమ ప్రదేశమని చెబుతారు. ఈ పీఠభూమి ప్రాణిరహిత మైనది. దీనిని దాటటానికి పన్నెండు రోజులు పట్టుతుంది. దీనిని దాటి కొండల మీదుగా, వాగులమీదుగా నలభై రోజులు ప్రయాణించాక బెలోర్ అన్న దేశం వస్తుంది. ఇక్కడినుంచి ఇంకా ముందుకు పోతే



కాష్గర్, సమర్కండ్, యార్కండ్ అన్న దేశాలు వస్తాయి.

ఖోటాన్ నగరం అదే పేరుగల దేశానికి రాజధాని. ఇది పెద్దఖాను సామ్రాజ్యం లోది. ఈ దేశంలో సంపన్నమైన నగరాలు చాలా ఉన్నాయి. పత్తి బాగా పండుతుంది. ద్రాక్షతోటలూ, పళ్లతోటలూ కొల్లలుగా ఉన్నాయి. కాష్గర్ నుంచి పెమ్ అనే దేశం దాకా తుర్కిస్తానం అంటారు.

కాష్గర్ దాటినది మొదలు నేల అంతా ఇసకపర్రలే, కాని అసలు ఎడారి లోప్ అనే నగరం అవతల ప్రారంభమవుతుంది. ప్రయాణీకులు ఈ నగరంలో విశ్రాంతి తీసుకుని నెలరోజులపాటు తమకూ, జంతువులకూ కావలిసిన సంబారాలు తీసుకుని ఎడారి ప్రయాణం సాగిస్తారు. ఎడారి నిడివి చాలా తక్కువగా ఉన్నచోట దాటటానికి నెల పడుతుంది; ఎక్కువగా ఉన్నచోట దాటటానికి పూర్తిగా ఏడాది పట్టుతుందట.

ఈ ఎడారి దాటటం చాలా ప్రమాదకరం. ప్రయాణీకుడు వెనకబడి గాని, అందరితోబాటు నిద్ర లేవకగాని ఒంటరి గాడైపోతే వాడు మృత్యువు వాత పడినట్టే. వాడికి ఎటునుంచో మాటలు వినవస్తాయి, తనను ఎవరో పిలిచినట్టు వినిపిస్తుంది,





ఒక్కొక్కప్పుడు వాడికి ప్రయాణీకులు కూడా కళ్లకు కనిపించినట్టవుతుంది. ఇవన్నీ భ్రమలని తెలియక వాడు వాటిని నమ్మి దారి తప్పిపోతాడు. ఇలా ప్రాణాలను పోగొట్టుకున్న ప్రయాణీకులు చాలామంది ఉన్నారు. అందుచేత ఎడారి దాటే ప్రయాణీకులు పొరపాటునకూడా ఒకరికొకరు దూరం కారు.

ఈ పెద్ద ఎడారి అవతల కాముల్ అనే దేశమూ, దాని అవతల మరొక చిన్న ఎడారీ ఉన్నాయి. ఈ ఎడారులన్నీ గడిచాక టాన్గుట్ అనే దేశం వస్తుంది. అందులో సూచౌ, కాన్చౌ మొదలైన గొప్ప నగరాలున్నాయి. దీనిని దాటిపోతే కారకోరం అనే నగరం, మూడుమైళ్ళ నిడివిగలది వస్తుంది. తాతార్లు తమ దేశం విడిచి వచ్చాక దీనినే తమ నివాసం చేసుకున్నారు.

ఈ తాతార్లు ఆదిలో మంచూరియాలోని చోర్చా ప్రాంతంలోనూ బైకల్ సరస్సు ప్రాంతంలోనూ ఉండేవారు. ఇక్కడ మైదానాలూ, జలసమృద్ధీ ఉండేవిగాని జనవాసాలు లేవు. వారికి ఒక నాయకుడు లేడు, కాని ఉంగ్ఖాన్ అనేవాడికి కప్పం కట్టి అతనికి లోబడి ఉండేవారు. ఈ ఉంగ్ఖాన్కు ప్రెస్టర్జాన్ అనికూడా పేరుండేది.



తాతార్ల సంఖ్య నానాటికీ పెరిగిపోతూండటం చూసి ప్రెస్టర్ జాన్ వారిని ముఠాలుగా చీలదీసి వేరువేరు ప్రాంతాలకు పంపాలనుకున్నాడు. ఈ సంగతి తెలియగానే తాతార్లు మూక ఉమ్మడిగా ఒక ఎడారిలోకి వెళ్ళిపోయి అక్కడ నివాసం ఏర్పాటుచేసుకుని ప్రెస్టర్ జాన్కు కప్పం కట్టటం మానేశారు.

కొంతకాలం గడిచాక ఈ తాతార్లు ఛింఘిజ్ఖాన్ను తమకు రాజుగా ఎన్నుకున్నారు. అప్పుడు ప్రపంచమంతటా ఉండే తాతార్లందరూ ఆయనను తమ రాజుగా ఆమోదించారు. వారి సంఖ్య అపారం. ఇంతమంది తనవెంట ఉన్నారని



తెలిసి ఛెంఘిజ్ ఖాన్ వారందరికీ బాహాలిచ్చి దిగ్విజయానికి బయలుదేరాడు. అతను న్యాయమైన పరిపాలకుడు కావటంచేత అతనిచేత ఓడినవాళ్ళుకూడా అతని అనుచరులుగా చేరారు.

అతను ప్రెస్టర్‌జాన్ కుమార్తెను పెళ్ళాడతానని కబురుచేశాడు. ప్రెస్టర్ జాన్‌కు మండిపోయింది. "వీడు నా బానిస. వీణ్ణి నిర్మూలిస్తాను," అన్నాడాయన. ఈ సంగతి విని ఛెంఘిజ్ ఖాన్ పట్టరాని ఆగ్రహంతో, తన బలాలను తరలించుకుని ప్రెస్టర్ జాన్‌తో యుద్ధం చెయ్యటానికి వచ్చాడు.

ఛెంఘిజ్ ఖాన్ వస్తున్నాడని తెలిసి ప్రెస్టర్ జాన్ భయపడలేదు. ఆయన తన సైన్యాన్ని సమాయత్తపరిచాడు. అదికూడా చాలా పెద్ద సేనే. ఛెంఘిజ్ ఖాన్ తన సేనలను టెండుక్ మైదానంలో విడియింపజేశాడు. ఆయన దైవజ్ఞులను సంప్రతించగా యుద్ధంలో విజయం ఆయనదేనని చెప్పారు. మరిరెండు రోజుల అనంతరం ప్రెస్టర్ జాన్ సేనలు ఆ మైదానం చేరాయి. రెండుపక్షాలకూ మధ్య అపూర్వమైన యుద్ధం జరిగింది. ఉభయపక్షాలా తీవ్రమైన జననష్టం జరిగింది. కాని ఛెంఘిజ్ ఖాన్ గెలిచాడు. ప్రెస్టర్‌జాన్ యుద్ధరంగంలో చనిపోయాడు. తరవాత ఛెంఘిజ్ ఖాన్ ప్రెస్టర్ జాన్ కూతుర్ని పెళ్ళాడినట్టు కొందరు చెబుతారు. ఆయన ఈ యుద్ధం ముగిసినాక ఆరేళ్ళపాటు రాజ్యంచేసి చాలా నగరాలూ, దేశాలూ జయించాడు. తరవాత ఆయన హెూచౌ అనే నగరంపై దాడిచేసేటప్పుడు మోకాలులో బాణం గుచ్చుకున్నది. ఆ గాయంతోనే ఆయన చనిపోయాడు.

ఛెంఘిజ్ ఖాన్ అనంతరం కుయుక్ ఖాన్ బాటూఖాన్‌లు పెద్దఖాన్‌లుగా పరిపాలించారు. మార్కోపోలో కాలానికి పెద్దఖాను కుబిలాయిఖాను. ఈయన సామ్రాజ్యం మిగిలిన పెద్దఖానులందరి సామ్రాజ్యాలనూ మించినది —(ఇంకా వుంది)





# గంగావతరణము

పంచమాశ్వాసము :

కొట్లకొలది పిడుగు లపుడు
పెట్లి పెటి ల్లనుచుండెను!
కళవళపడి ఆకాశము
ఫెళఫెళఫెళ మనుచుండెను!

గజగజమని భూతలమ్ము
గగ్గోలుగ కంపించెను!
పట్టు సడలి సంద్ర మపుడు
చుట్టుపట్ల ముంచెత్తెను!

కొండదరుల నందీశుడు
కుమ్మికుమ్మి అంకె వేసె.
పార్వతమ్మ భయము జెంది
పరమశివుని కౌగిలించె!

చెదరిపోయె కనుచూపులు,
చెవులకు దిబ్బెళ్లు కలిగె,
గజగజమని పళ్లన్నియు
కదలె భగీరథుని కపుడు.

దొనదొనదొన గంగానది
దుమికి దుమికి ఏతెంచెను!
తెరలి తెర్లి గంగానది
పొరలి పొర్లి ప్రవహించెను!

అంత కొంతసేపటికిని
ఆకాశము తెల్లబారె;
శాంతించెను గంగానది,
జగమెల్లను సద్దుమణిగె.

భగీరథుడు కనులు తెఱచి
పరికించెను శివమూర్తిని.
మంచుకొండ శిఖరాలను
మించి శివుడు కనిపించెను!

పార్వతి భయభక్తులతో
పరికించెను తనదు మగని.
భగీరథుడు చేతు లెత్తి
ప్రార్థించెను పరమశివుని.

ఉత్పల సత్యనారాయణాచార్య



"ఏది స్వామి! గంగానది ?
నీదు జడల నిమిడినదో!
నిన్ను చూచి వలపుచెంది
నేలకు రాకుండినదో!

అల్లదిగో! నీదు జడల
అణగి యుండె గంగానది.
భూమిపైకి విడువు ప్రభూ!
పుణ్యము గావింపు ప్రభూ!"

భగీరథుని ప్రార్థన విని
పరమేశ్వరు డొక్క జడను
భువి మీదికి వంచినాడు,
బొట్లుగ పడనిచ్చినాడు.

ఆ బొట్లు హిమాలయముల
పైబడి సెలయేఱు వోలె
జాలువాఱి పాఱి పాఱి
నేలపైకి తరలి వచ్చె.

"పుణ్యనదీ! వచ్చితివా!
భువిమీదికి వచ్చితివా!
జయము జయము పుణ్యనదీ!
జయము జయము గంగానది!

రమ్మ తల్లి గంగానది,
రావమ్మా నా వెంబడి!
భువి నంతను పరిశుద్ధిని
పొందించుచు రావమ్మా."

అని యెంతో సంతసమున
ఆ తల్లిని వేడుకొనుచు
భగీరథుడు రథము నెక్కి
పయనమ్మును సాగించెను.

అతని వెంట గంగానది
అనుసరించి ప్రవహించెను.
దొనదొన జని అచటి జహ్ను
ముని యాశ్రమమును ముంచెను.

ఆ గంగను కోపగించి
త్రాగివేసె జహ్ను తపసి.
భగీరథుడు మునికి మ్రొక్కి
బతిమలాడె విడిపింపగ.

జహ్నుతపసి చెవి నుండియు
జాహ్నవియై వచ్చె గంగ!
బదరికాశ్రమమును దాటి
బయలుదేరి వచ్చె గంగ!

హృషికేశ హరిద్వార
ఋష్యాశ్రమ ముక్తేశ్వర
పుణ్యపదము లెల్ల దాటి
పొంగులెత్తి వచ్చె గంగ!

లోయలలో నిండిపోయి,
పాయలుగా చీలిపోయి,
మరల తాను ఒక్కటెగా
పొరలి పొర్లి వచ్చె గంగ!

భగీరథుని రథము ముందు
పరుగులెత్తి పోచున్నది.
దాని వెనక గంగానది
ఉఱుముకొనుచు పోచున్నది.

"ఏమోయా! భగీరథా!
నా మాటను విను మొక్కటి—
పట్టుదలకు పేరుపడిన
దిట్టతనము కలవాడవు!

దివి నుండిన నన్ను నీవు
భువి మీదికి తెచ్చినావు;
నీదు నగరమునకు కూడ
నేరగ కొని పోరాదా?"



అని పలికెను గంగానది,
ఆత డప్పు డిట్లనియెను:
"తల్లీ! నా పురికి నిన్ను
తరలింపను తరలింపను.

భూలోకము పరిశుద్ధము
పొందింపగ నిను తెచ్చితి
గాని నాదు పురికి శోభ
కలుగుటకై కాదు-కాదు."

అని చెప్పగ గంగానది
మనమున సంతోషమొంది,
"భగీరథా! నేటి నుండి
ప్రవహించెద నీ పేరట"

అని పలికియు నతని వెంట
ననుసరించె భాగీరథి.
కాశీపుర పాట్నాలను
గడచి వచ్చె గంగానది.

వంగదేశమునకు తూర్పు
వైపున గల కలకత్తా
నగరమందు తరలి గంగ
భగీరథుని కిట్లనియెను:

"నీ వింకిట మరలి పొమ్ము.
నే నీ సంద్రమున దూకి
సగరరాజ సుతుల కెల్ల
శాంతిని కలిగించుదాన.

అటుపిమ్మట రత్నాకరు
నలల కౌగిలింతలలో
అశ్రాంతము కోకొల్లగ
విశ్రాంతిని అనుభవింతు—"

ఇప్పటికిని మింట నుండి
ఈ భూమికి దిగుచు గంగ
వేల "మైళ్లు" పారి జలధి
విశ్రాంతిని గనుచున్నది!

★ సంపూర్ణం ★





# విశ్వాసపాత్రుడు

అనగా అనగా ఒక దేశంలో ఒక రాజకుమారుడుండేవాడు. అతను అపార ధనవంతుడే గాక గొప్ప దాతకూడానూ. ప్రతి ఉదయమూ అతని భవనంముందు అడుక్కు తినే జనం వేనకువేలు పోగై అతనినుంచి ధర్మం పొందేవారు. నగరంలోని గొప్పవారంతా అతని ఇంట విందులు ఆరగించి, అతన్ని స్తోత్రం చేసేవారు.

రాజకుమారుడికి పెళ్లి కాలేదు. భార్యా, కుటుంబమూ లేకపోయినా అతనికి ప్రజలందరూ తన కుటుంబమే అనిపించేది. ప్రతి ఉదయమూ బిచ్చగాళ్లు తనవద్ద దానాలు గ్రహించి, "మహారాజుగారు వెయ్యేళ్లు వర్ధిల్లాలి! తమరికోసం సముద్రంలో దూకమన్నా దూకుతాం!" అనేవారు. మధ్యాన్నం గొప్పవాళ్లందరూ రాజకుమారుడి వెంట విందులు ఆరగించి, "మహారాజుగారే మాకు తల్లీ తండ్రీనీ! తమకోసం నిప్పులో దూకమన్నా దూకుతాం!" అనేవారు. ఈ పొగడ్తలన్నీ వింటూఉంటే రాజకుమారుడికి పరమానందం కలిగి, తనకు ఏలోటూ లేనట్టుగా తోచేది.

ఇలా ఉండగా ఒకనాడు ఒక యువకుడు రాజకుమారుడి వద్దకు వచ్చి, "మహారాజా, తమరు ధర్మదాతలని విని ఒక పెద్ద సహాయం కోరి వచ్చాను. నేను అభాగ్యుణ్ణి. అష్టకష్టాలూ పడి ఈ మధ్యనే పెళ్లి చేసుకుంటే నా భార్య పోయింది. ఆమె అంత్యక్రియలకుగాను పది వరహాలిప్పించారంటే ఆ పని ముగించుకుని వచ్చి, జీతం భత్యం లేకుండా మీ నౌకరుగా జీవిస్తాను!" అని వేడుకున్నాడు.

"పదివరహాలకేనా పెద్ద సహాయం అంటున్నావు? నూరు వరహాలిస్తాను. నీ భార్య అంత్యక్రియలు శాస్త్రోక్తంగా జరిపించి, పేదసాదలకు అన్నదానం చేసి రా. నిన్ను

పి. వెంకటరావు



నా నౌకరుగా పెట్టుకుంటాను. జీతంకూడా ఇస్తాను," అన్నాడు రాజకుమారుడు.

యువకుడు రెండురోజుల అనంతరం రాజకుమారుడివద్దకు వచ్చి పరిచారకుడుగా ప్రవేశించాడు. జీతం అడగమంటే, "మహా రాజా, నాకు ప్రపంచంలో ఎవరూ లేరు. ఎప్పుడైనా డబ్బు కావలిసివస్తే నేనే తీసు కుంటానులెండి," అన్నాడు.

రాజకుమారుడు తన పరిచారకుణ్ణి ఒత్తిడిచెయ్యక వాడికి ఇంటి పెత్తనమంతా వప్పగించేసి ఊరుకున్నాడు.

కొద్దిరోజులు గడిచాయి. ఒకనాడు పరి చారకుడు రాజకుమారుడివద్దకు వచ్చి, "మహారాజా, తమరు ద్రవ్యం మంచినీరు లాగా ఖర్చుపెట్టేస్తున్నారు. బిచ్చగాళ్ళకిచ్చే దానధర్మాలూ, గొప్పవాళ్ళకిచ్చే విందులూ తగ్గిస్తే బాగుంటుంది. ఇలా ఖర్చుచేస్తూపోతే కొండలుకూడా తరిగిపోతాయే! ఇదికాస్తా అయిపోయాక ఏంచేస్తారు? తమకు ఎలా గడుస్తుంది?" అని హితబోధ చేశాడు.

రాజకుమారుడు నవ్వి, "వెర్రివాడా! ఉన్నదంతా అయిపోతే మటుకు నాకేం తక్కువ? పిల్లా జెల్లా లేరాయె. ఉన్నదంతా అయిపోతే నా రాజ్యంలో ప్రతిఒక్కడూ నన్ను ఆదుకుంటాడు. రోజూ బిచ్చగాళ్లు నాకోసం సముద్రంలో దూకమన్నా దూకుతా మంటారు, గొప్పవాళ్లు నిప్పులో దూక మన్నా దూకుతామంటారు. వాళ్ళంతా నాకుండగా నాకేం కొరత?" అన్నాడు.

"వాళ్ళ మాటలు నమ్మటానికి లేదు," అన్నాడు పరిచారకుడు.

ఆరోజు విందు జరిగే సమయంలో రాజ కుమారుడు తన అతిథులను, "మిత్రు లారా, నాకోసం అవసరమైతే మీరు నిప్పులో కూడా దూకటానికి సిద్ధంగా ఉన్నామని రోజూ చెబుతారు. కాని మీ మాటలు నమ్మ టానికి లేదంటున్నాడు నా పరిచారకుడు. మీ సమాధానమేమిటి?" అని ప్రశ్నిం

చాడు. అతిథులందరికీ ఆగ్రహం వచ్చింది. వారందరూ కూడబలుక్కున్నట్టుగా, "మీ పరిచారకుడు పట్టి దొంగవెధవ. వాడు తమరిని నిలువునా దోచేస్తున్నాడు. నమ్మటానికి వీలులేనివాడు వాడూ!" అని కేకలుపెట్టారు.

రాజకుమారుడు తన పరిచారకుణ్ణి పిలిపించి, "నువ్వు నా సొత్తంతా కాజేస్తున్నావుటగా?" అని అడిగాడు.

"అది నిజమే, మహాప్రభూ! నేను తమ సొమ్ము చాలా తస్కరించాను," అన్నాడు పరిచారకుడు.

"ఛీ, నీ ముఖం నాకు చూపకు. తక్షణం నా యిల్లు విడిచి వెళ్ళిపో!" అన్నాడు రాజకుమారుడు తన పరిచారకుడితో. పరిచారకుడు నగరం దాటి, నది దాటి, నది అవతలి ఒడ్డున గల తన భవనానికి వెళ్ళిపోయాడు.

రాజకుమారుడి దగ్గిర దొంగిలించిన బంగారంతోనే వాడు ఆ భవనాన్ని కొంత కాలంక్రితం కొన్నాడు.

తరవాత ఒక సంవత్సరంపాటు రాజకుమారుడు తన పాత అలవాటు తప్పకుండా పేదలకు దానధర్మాలూ, గొప్పవాళ్ళకు విందులూ చేస్తూ కాలక్షేపం చేశాక అతని ఖజానా కాస్తా ఖాళీ అయిపోయింది. అందులో ఇక చిల్లిగవ్వకూడా లేదు. ఇకనుంచీ తన



ప్రజలే తనను పోషించగలరని అతను పూర్తిగా నమ్మాడు.

అతను గొప్పవాళ్ళకు ఆఖరు విందు చేస్తూ, "మిత్రులారా, ఇదే నేను మీకు చేసే తుది విందు. ఇక నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. ఇంతకాలమూ మీరు నాకోసం అగ్నిలో దూకమన్నా దూకుతామన్నారు గనక రేపటినుంచీ మా పోషణభారం మీరు వహిస్తారనుకుంటాను!" అన్నాడు.

అతిథులు ముఖాలు మాడ్చుకుంటూ, ఒకరినొకరు చూసుకుని, "మహారాజా, మీరు సొమ్మంతా దానధర్మాలు చేసి తగలేశారు. మీ సొత్తంతా బిచ్చగాళ్లకు ధారపోశారు.

మీకు ఈ తరుణంలో సాయపడవలసింది ఆ బిచ్చగాళ్లే గాని మేము కాము!" అన్నారు. ఆ తరవాత వారు రాజకుమారుడికేసి చూడ నైనా చూడకుండా తమలో తాము మాట్లాడుకోసాగారు. రాజకుమారుడు మొదట తన చెవులను తానే నమ్మలేక పోయాడు, ఈ గొప్పవాళ్లంతా తనను వంచించారని తెలుసుకున్నాడు.

తరవాత అతను తన దగ్గిరికి వచ్చి దాన ధర్మాలు పుచ్చుకునే బిచ్చగాళ్లతో, "మీ కందరికీ ఇంతకాలమూ విరివిగా దాన ధర్మాలు చేశాను. నాకోసం సముద్రంలో దూకమన్నా దూకుతామని మీరు రోజూ అంటూ వచ్చారు. ఇప్పుడు నాదగ్గిర ఉన్న సొమ్మంతా అయిపోయింది. అందుచేత ఇక నుంచీ నేను మిమ్మల్ని పోషించలేను, మీరే నన్ను పోషించాలి," అన్నాడు.

"మహారాజా, మీరు రోజూ గొప్ప వాళ్లందరినీ చేరదీసి విందులు చేస్తే సొమ్మంతా అయిపోక ఏం చేస్తుంది? మిమ్మల్ని పోషించవలిసినవాళ్లు వాళ్లు. వాళ్లు పోషించకపోతే మీరుకూడా మాతోబాటు ముష్టెత్తుకోవలిసిందే," అన్నారు బిచ్చగాళ్లు.

రాజకుమారుడు రెండువిధాలా చెడి, తనను కలవారూ లేనివారూ కూడా మోసగించినందుకు విచారంతో కుంగిపోయి ఉండగా, గుర్రంమీద సవారీఅయి పాత పరిచారకుడు వచ్చాడు.

"మహారాజా, నేను అన్నంతా అయిన ట్టుందే? ఇలా జరుగుతుందని తెలిసే నాకు సాధ్యపడ్డంతమటుకు తమ సొమ్ము నది అవతల కోటలో భద్రంచేశాను. ఈ జనాన్నీ, భవనాన్నీ విడిచిపెట్టి అక్కడ సుఖంగా జీవింతాం పదండి," అంటూ పరిచారకుడు రాజకుమారుణ్ణి తన భవనానికి తీసుకు పోయాడు. ఆ తరవాత ఆ ఇద్దరూ తగిన భార్యలను పెళ్ళాడి అన్నదమ్ములలాగా సుఖంగా జీవించారు.





# నేలమీద నడిచే పడవ

చాలాకాలం కిందట ఎక్కడో ఒక రాజుండేవాడు. ఆ రాజు దగ్గిర ఎన్నో వింత వస్తువులున్నాయి. ఆయనకొక కూతురుకూడా ఉన్నది; ఆ దేశంలో ఆమెను మించిన అందగత్తె లేదు. ఇన్ని ఉండినా ఆయనకు ఒక పెద్ద లోటు కనిపిస్తూ వచ్చింది. అదేమిటంటే, ఆయన ఎంతోకాలంగా నేలమీద కూడా నడవగల పడవను గురించి కలలు కంటూ వచ్చాడు; నేలమీదా, నీటిమీదా నడిచే పడవను తయారుచేసి ఇవ్వమని ఎందరినో కోరాడు. కాని అలాటి పడవను ఆయనకు చేసి ఇచ్చినవారు లేకపోయారు.

చివరకు రాజుగారికి విసుగెత్తిపోయింది. "నీటిమీదా నేలమీదా నడవగల పడవను ఎవరైతే తయారుచేసి నాకిస్తారో వారికి నా కుమార్తె నిచ్చి పెళ్ళిచెయ్యటమే గాక అర్ధ రాజ్యంకూడా ఇస్తాను," అని దేశమంతటా చాటింపు వేయించాడు.

ఆ రాజ్యపు పొలిమేర ప్రాంతంలోని అడవికి సమీపంలో ఒక కట్టెలు కొట్టి జీవించేవాడుండేవాడు. వాడికి ముగ్గురు కొడుకులు. పెద్దకొడుకు రాజుగారు చేసిన చాటింపు విన్నాడు. రాజకుమార్తెను పెళ్ళాడాలని వాడికి బుద్ధిపుట్టింది. ఒకనాడు ఉదయం వాడు తన గొడ్డలి భుజాన వేసుకుని, అన్నం మూట చేత పట్టుకుని అడవిలోకి వెళ్ళి ఒక పెద్ద చెట్టు చూసుకుని మధ్యాన్నందాకా పని చేసి దాన్ని పడగొట్టాడు. ఆ తరవాత వాడు తన అన్నంమూట విప్పి తినటానికి ఉపక్రమించాడు. ఇంతలో చెట్టుమీదినుంచి నీల కంఠపక్షి ఒకటి గెంతుకుంటూ వచ్చి, "నాకు కొంచెం! నాకు కొంచెం!" అని అడిచింది.

"పోవే, పక్షీ! ఇందులో నీకక్కడా వంతా?" అన్నాడు పెద్దవాడు. పక్షి మరింత దగ్గిరిగా వచ్చి, "సరేగాని, ఈ మానుతో ఏంచేస్తావేమిటి?" అని అడిగింది.

ఎస్. ఇందిరాదేవి

"ఏంచేస్తే నీకేం? మంచంకోళ్ళు చేస్తాను! సరేనా?" అన్నాడు పెద్దవాడు.

"మంచంకోళ్ళు! మంచంకోళ్ళు! మంచంకోళ్ళు!" అని అరుస్తూ నీలకంఠపక్షి ఎగిరిపోయింది. పెద్దవాడు తిండి పూర్తి చేసి కాస్త విశ్రాంతి తీసుకుని గొడ్డలితో మానును చెక్కనారంభించాడు. మానుకు గొడ్డలి తగిలినప్పుడల్లా ఒక మంచంకోడు దానంతట అదే తెగి పడసాగింది. అందులో వాడి ప్రయత్నం ఏమీ లేదు. సాయంకాలమయేసరికి మానంతా మంచంకోళ్ళుగా మారిపోయింది. వాడు గొడ్డలి అక్కడే పారేసి చిరాకుతో ఇంటికి వెళ్ళాడు.

"నేలమీద నడిచే పడవ ఎంతవరకు తయారయింది?" అని వాణ్ణి తమ్ములు అడిగారు. వాడా ప్రశ్నకు జవాబు చెప్పక, "రాజుగారి కూతుర్ని ఎవరు పెళ్ళాడతారేమిటి?" అన్నాడు.

మర్నాడు రెండోవాడు తన గొడ్డలి తీసుకుని అడవికి వెళ్ళి, మంచి మాను చూసి పడగొట్టి, వెంట తెచ్చుకున్న తిండి తినటానికి ఒక చెట్టుకింద కూచున్నాడు. ఇంతలో నీలకంఠపక్షి, "నాకు కొంచెం! నాకు కొంచెం!" అంటూ వచ్చింది.

"పోవే, పక్షీ! ఇందులో నీకూ కావాలంతా?" అన్నాడు రెండోవాడు.



పక్షి వాణ్ణి సమీపించి, "సరేగాని, ఈ మానుతో ఏంచేస్తావేమిటి?" అని అడిగింది.

"ఏంచేస్తే నీకేం? చల్లకవ్వాలు చేస్తాను! సరేనా?" అన్నాడు వాడు.

"చల్లకవ్వాలు! చల్లకవ్వాలు! చల్లకవ్వాలు!" అని అరుస్తూ నీలకంఠపక్షి ఎగిరిపోయింది.

తరవాత రెండోవాడు తాను పడగొట్టిన మానును గొడ్డలితో ఒక వేటు వేసినప్పుడల్లా మానునుంచి ఒక చల్లకవ్వం తెగి పడింది. ఎంత ప్రయత్నించినా వాడికి చల్లకవ్వం తప్ప మరేదీ రాలేదు. సాయంకాలానికల్లా మానంతా చల్లకవ్వాలుగా మారిపోయింది. వాడు విసుక్కుంటూ తన గొడ్డలి అక్కడే పారేసి ఇంటికి వెళ్ళాడు.

"నేలమీద నడిచే పడవ ఎంతవరకు తయారయింది?" అని మిగిలిన ఇద్దరూ అడిగితే రెండోవాడు, "అసలు రాజకుమార్తె ఎవడికొక్కవాలి?" అన్నాడు.

ఆ మర్నాడు మూడోవాడుకూడా నేల మీద నడిచె పడవను తయారు చెయ్యటానికి బయలుదేరాడు. వాడు తన గొడ్డలి భుజాన పెట్టుకుని, భోజనం చేత పట్టుకుని అడవిలోకి వెళ్ళి మంచి నిడుపైన మాను చూసి మధ్యాన్నందాకా దాన్ని కొట్టి పడగొట్టాడు. తరవాత వాడు భోజనానికి కూచున్నాడు.







అంటూ నీలకంఠపక్షి తుర్రున చెట్ల మీదికి ఎగిరిపోయింది.

మూడోవాడు భోజనం పూర్తిచేసి కాస్సేపు విశ్రాంతి తీసుకుని గొడ్డలితో మానును నరక సాగాడు. గొడ్డలి దెబ్బ తగిలినప్పుడల్లా ఒక పడవ భాగం దానంతట అదే తయారై తన స్థానంలో అమరింది. ఈ విధంగా సాయంకాలం అయేసరికి ఒక పడవలాటిది తయారై పోయింది. దాన్ని చూసి మూడోవాడు, "ఇది నిజంగా నడుస్తుందా?" అనుకుంటూ అందులోకి ఎక్కి చుక్కాని పట్టుకుని, "పదవే, పడవా!" అన్నాడు. వెంటనే పడవ చెట్లమధ్యగా నడవసాగింది.

ఇంతలో నీలకంఠపక్షి వచ్చి, "నాకు కొంచెం! నాకు కొంచెం!" అన్నది. మూడోవాడు దాన్ని చూసి ముచ్చటపడి తన భోజన పదార్థాలను చుట్టూతా నేలపై రాల్చాడు. పక్షి గెంతుతూ వాటన్నిటినీ ఏరుకు తిని దగ్గిరిగా వచ్చి, "సరేగాని ఈ మానుతో ఏంచేస్తావేమిటి?" అని అడిగింది.

"నేలమీద నడిచే పడవ తయారు చెయ్యాలని నా ఉద్దేశం. అది ఎలా ఉంటుందో నాకైతే తెలీదు," అన్నాడు మూడోవాడు.

"నేలమీద నడిచే పడవ! నేలమీద నడిచే పడవ! నేలమీద నడిచే పడవ!"

పడవ కొంతదూరం వెళ్ళేసరికి దారిలో ఒక మనిషి ఎముకల కుప్ప చుట్టూ పెట్టుకుని వాటిని ఆత్రంగా పళ్ళతో గీరుతున్నాడు. మూడోవాడు వాణ్ణి చూసి, "ఎందుకలా ఉత్త ఎముకలు గీరుతున్నావు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం చేసేది? ఎంత తిన్నా నా ఆకలి తీరదు. ఉన్న డబ్బంతా తిండి కింద ఖర్చు చేశాను," అన్నాడు ఆ మనిషి.

"నేను రాజభవనానికి పోతున్నాను. నావెంట రా. అక్కడ నీ ఆకలి తప్పక తీరుతుంది," అన్నాడు మూడోవాడు.



ఆకలిగాడు పడవలో ఎక్కి కూచున్నాడు. పడవ ముందుకు సాగింది.

మరికొంతదూరం వెళ్లాక ఒక మనిషి ఒక వాగులో నోరుపెట్టి నీరు తాగేస్తున్నాడు. వాగులోని నీరు కొంచెం కొంచెం తగ్గిపోతున్నది.

"ఎవరు నువు? ఎందుకిలా చేస్తున్నావు?" అని మూడోవాడు అడిగాడు.

"ఏం చేసేది? నా దాహం ఎంతకూ తీరదు. సాగినన్నాళ్లు సారా పీపాలకు పీపాలే తాగేశాను. ఇప్పుడు నీరు తాగేస్తు న్నాను. కాని నీటితో నా దాహం తీరదు," అన్నాడు దాహంగాడు.

మూడోవాడు వాణ్ణికూడా తనవెంట రాజ భవనానికి రమ్మని ఆహ్వానించాడు. దాహం గాడు ఆనందంతో ఎగిరి పడవలో కూచు న్నాడు. పడవ ముందుకు సాగింది.

ఒకచోట ఒక యువకుడు కనిపించాడు. వాడు సగం అడవిని భుజాన పెట్టుకుని వస్తున్నాడు. మూడోవాడు వాడితో, "ఇన్ని చెట్లు పట్టుకుపోతున్నా వెక్కడికి?" అని అడిగాడు.

"మా మారుతల్లి ఎన్ని కట్టెలు తెచ్చినా ఇంతేనా అని అడుగుతుంది. నాకు కోపం వచ్చి సగం అడవి పట్టుకుపోతున్నాను," అన్నాడు యువకుడు.



"ఎందుకు శ్రమ పడతావు? నావెంట రా! నేను రాజుగారికి అతిథిగా వెళు తున్నాను. మనకక్కడ బాగా జరుగు తుంది," అన్నాడు మూడోవాడు. అడవి మోసేవాడుకూడా పడవలోకి ఎక్కాడు. వాడు ఒక్క పెద్ద చెట్టుమాత్రం చేతికర్రగా ఉంచుకుని మిగిలినవి అవతల పారేశాడు. పడవ ముందుకు సాగింది.

కొంతదూరం వెళ్ళాక వారికి మరొక వింత మనిషి కనపడ్డాడు. వాడు తల పైకెత్తి నోటితో ఆకాశంలోకి ఊదుతున్నాడు.

"ఎందుకిలా చేస్తున్నావు?" అని మూడో వాడు అడిగాడు.

"ఏంచేసేది? ఇంకా మా ఖామందుగారి పొలాలలో నూర్పిళ్ళు పూర్తికాలేదు. వాన మబ్బులు వచ్చి కూడుతున్నాయి. వాటిని చెదరగొట్టుతున్నాను. ఎంత శ్రమ పడినా నాకు ఒక్క గింజ పెచ్చు ఇవ్వరులే," అన్నాడు రైతు.

"అలాటి ఉద్యోగం నీకెందుకు? నాతో రాజుగారింటికి వచ్చెయ్యి. హాయిగా అక్కడ కొలువు చేసుకుందాం," అన్నాడు మూడో వాడు. మబ్బులూదేవాడుకూడా పడవలో ఎక్కి కూచున్నాడు.

కట్టెలు కొట్టేవాడి మూడో కొడుకు ఆకలి గాణ్ణి, దాహంగాణ్ణి, అడవి మోసేవాణ్ణి,



మబ్బు లూదేవాణ్ణి వెంటబెట్టుకుని రాజుగారి ఇంటికి పోయి, "మహా రాజా, నేలమీద నడిచే పడవ చేసి తెచ్చాము. చూసుకోండి!" అన్నాడు. రాజు ఆశ్చర్యపడుతూ వచ్చి పడవలోకి ఎక్కి, నేలమీదా, నీటిమీదా నడిపించి చూసుకున్నాడు. "బాగున్నది. ఇటువంటి పడవే నేను కోరినది. నీకు తగిన బహుమానం ఇప్పిస్తాలే!" అన్నాడు.

"మీ అమ్మాయి నిచ్చి పెళ్ళిచేసి అర్ధ రాజ్యం ఇస్తామన్నారుగద! అలాగే చేయించండి," అన్నాడు కట్టెలు కొట్టేవాడి కొడుకు.

రాజు కిది ఏమాత్రమూ ఇష్టంలేదు. తన కుమార్తెను ఏ రాజకుమారుడికో ఇవ్వక ఈ కట్టెలుకొట్టేవాడి కొడుక్కు ఎలా ఇవ్వటం? అందుచేత ఆయన మూడోవాడితో, "మా అమ్మాయినిచ్చి పెళ్ళి చేస్తానన్నమాట నిజమేగాని అది ఇంతలో తెమిలే విషయం కాదు. సంబారపు కొట్లనిండా పాత ఆహార పదార్థాలున్నాయి. అవన్నీ ఖర్చు అయాక కొత్త సరుకులు తెప్పించి అప్పుడుగాని పెళ్లి ముహూర్తం పెట్టటానికి లేదు," అన్నాడు.

"పాతవి క్షణంలో ఖర్చవుతాయి. అదంతా నాకు వదలండి," అని రాజుతో చెప్పి మూడోవాడు ఆకలిగాణ్ణి రాజుగారి సంబారాల కొట్టుకు పంపాడు. ఒక్క గడియ లోపుగా వాడు కొట్టంతా ఖాళీచేసి



వచ్చాడు. "కొత్తసంబారాలు తెప్పించి పెళ్లి ముహూర్తం పెట్టండి," అన్నాడు మూడో వాడు రాజుతో.

"సంబారాలు అయిపోతే సరా? పీపాల నిండా సారా ఉన్నది. అది కాస్త పులిసి నట్టు అనుమానంగా ఉన్నది. అదంతా ఖర్చయిపోయాక, కొట్లలో కొత్తసారా నించి తరవాత ముహూర్తం పెడతాను," అన్నాడు రాజు.

"అదెంత పని?" అంటూ మూడోవాడు దాహంగాణ్ణి రాజుగారి సారా కొట్టుకు పంపాడు. వాడు అరగడియలో పీపాలన్నీ ఖాళీ చేసి వచ్చి, "ఇవాళ నాకు పండగ లాగా ఉంది!" అన్నాడు.

రాజుగారికి మాత్రం కట్టెలు కొట్టేవాడి కొడుకుమీద కోపం వచ్చింది. ఆయన తన కాల్బలాన్ని పిలిచి, "ఈ కట్టెలు కొట్టే వాణ్ణీ, వాడి స్నేహితులనూ ఇక్కడినుంచి తరిమెయ్యండి," అన్నాడు.

కాల్బలం తమపైకి రావటం చూసి మూడోవాడు అడవి మోసేవాడితో, "వాళ్ల సంగతి చూడు!" అన్నాడు.

అడవి మోసేవాడు తన చేతిలో ఉన్న చెట్టుతో రాజుగారి కాల్బలాన్ని కసువు ఊడ్చినట్టు ఊడ్చేశాడు.

రాజుగారు మరింత మండిపడి తన అశ్వికదళాన్ని పంపాడు. మబ్బులూదే వాడు గట్టిగా ఊదేసరికి గుర్రాలూ, సైనికులూ కూడా గాలికి ఎండుటాకులు కొట్టుకుపోయినట్టు కొట్టుకుపోయారు. ఇంకా కొంచెం ఉంటే వాడు తన రాజభవనాన్నీ, తననుకూడా ఊదేస్తాడని భయపడి రాజు గారు కట్టెలు కొట్టేవాడి కొడుకును పిలి పించి, మర్యాదగా తన కుమార్తె నిచ్చి పెళ్లి చేసి అర్థరాజ్యంకూడా ఇచ్చేశాడు.

తరవాత మూడోవాడు రాజై తనవెంట వచ్చిన నలుగురినీ మంత్రులుగా పెట్టుకుని సుఖంగా రాజ్యం చేశాడు.



# గలివర్ యాత్రలు



"ఆ మహాయంత్రంవద్ద నిలవడమే కష్టమయి పోయింది. పర్వతకాయుడి కోటు జేబుల్లో మరి కొన్ని వస్తువులున్నాయి."



"అవి: పెద్ద మడతకత్తి ఒకటి, రథచక్రాలంతటి బంగారపు నాణాలూ, నల్లటి పెద్ద 'గోళాలు.' (ఆ గోళాలు నా పిస్తోలుగుళ్ళు).



చక్రవర్తిగారు ఈ నివేదిక చదువుకోగానే వెంటనే బయలుదేరి వచ్చారు. ఉక్కుతో చేసిన పొడుగాటి గొట్టంలాటి యంత్రం చూపమన్నారు.



ఆయన చెప్పినది నా పిస్తోలు— తీసి గాలిలోకి పేల్చాను. ఆ ధ్వనికి రాజుగారి పరివారమంతా కకావికలై పరిగెత్తింది.



తరవాత చక్రవర్తి గారి ఆజ్ఞ ననుసరించి నా గడియారం, చాకు, పిస్తోలు ఒక బండిమీద వేసి తీసుకువెళ్లిపోయారు.



అదృష్టవశాత్తు వారి కంటబడని నా కళ్లజోడు నావద్దనే ఉండిపోయింది. దానిని తీసుకుని పదిలపరచుకున్నాను.






తరువాత ఒక రాజప్రతినిధి వచ్చాడు. నా సంకెళ్ళు తొలగించడానికి రాజాజ్ఞ అయిందని చెప్పి అందుకు కొన్ని షరతులు వినిపించాడు.

సంకెళ్ళు తీస్తున్నందుకు సంతోషం కలిగినా నేను పొత్తిగా ఎరగని ఒక రాజ్యానికి హాని చెయ్యమనడం నాకు ఏమాత్రమూ నచ్చలేదు.






కానీ అంతటి మహాచక్రవర్తి మాట కాదనడానికి నే నెంతవాణ్ణి? నా ఇష్టాయిష్టాలతో నిమిత్త మేమిటి? ఎదురాడకుండా ప్రమాణం చేశాను.

నా భుజం ఎత్తున వున్న మహావృక్షాలను తప్పించుకుంటూ రాజధాని మిల్డెండో నగరాన్ని చూడడానికి బయలుదేరాను.



నా రాకని రెండుగంటల ముందుగా నగరాన్ని హెచ్చరించారు. వీధులన్నీ ఖాళీ అయిపోయాయి. ప్రజలు మేడల కిటికీల్లోంచీ, తలుపు సందులనుంచీ చూస్తున్నారు. అయిదడుగుల వెడల్పున్న రాజ బాటలో జాగ్రత్తగా కాలు మోపాను. రాజభవనంవైపు దారితీశాను.



నగరం మధ్యన రాజభవనం అత్యంత సుందరంగా కనబడింది. అందంగా పెంచిన పచ్చటి ఉద్యాన వనాలూ, తళతళ మెరుస్తున్న అయిదడుగుల ఎత్తు పాలరాతి భవనాలు, ఎంతో ముచ్చట గొలిపాయి. కోటమధ్యన నలభై చదరపు అడుగుల ఖాళీస్థలం వుంది.



రెండడుగుల ఎత్తు వున్న కోట గోడను అతి జాగ్రత్తగా దాటాను, ఏ మేడ నేలమట్టమవుతుందో అని భయపడుతూ—



ఆ ఖాళీస్థలంలో ఓరిగిలా మేను వాల్చి, కిటికీలూ, ద్వారాలూ తెరిచివున్న భవనంలోనికి తొంగి చూచాను.



అతి వైభవంగా వున్న చక్రవర్తి అంతఃపురం పట్టు తెరలతో, పసిడి సింహాసనాలతో వెలిగిపోతోంది. రాణీగారూ, చక్రవర్తీ, ఆయన పరివారమూ కొలువుతీర్చి ఉన్నారు.




ఇంతలో మంత్రిగారు కిటికీవద్దకు వచ్చి, లిల్లిపుట్ శత్రువులైన బ్లెఫుస్కూ రాజ్యం వారు దండయాత్రకి బయలుదేరుతున్నారనీ, నేను వారి నెదుర్కోవాలనీ తెలిపారు.





సముద్రతీరానికి వెళ్ళగా దూరాన బ్లెఫుస్కూ రాజ్యపు తీరం కనబడింది. వారి ఓడల తెరచాప కొయ్యలు పుల్లల్లాగా కనబడ్డాయి.

రెండు రాజ్యాలకి మధ్యనున్న సముద్రం అట్టే లోతు లేదు. నెమ్మదిగా నడుస్తూనే అరగంటలో అవతలి ఒడ్డు సమీపించాను.



శత్రువులకు కనబడకుండా పొంచిపొంచి ముందుకు సాగి, రేవు సమీపించి—





ఒక్కసారిగా పైకి లేచి పెద్ద కేక వేశాను. అది వారి పాలిట ఉరుములా వినిపించి, నా పర్వతకాయం భయంకరంగా కనిపించి, హడలగొట్టింది. అక్కడున్న యుద్ధ నావలలోని సైనికులు చాలామంది నీళ్ళలో దూకి, ఒడ్డుకు ఈది, చెల్లాచెదరై పరిగెత్తారు.




# కపట యుద్ధం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనుషులు దేనికోసం తమ సుఖాన్నీ, కీర్తినీ త్యాగం చేస్తారో చెప్పలేం గదా! ఏమి కోరి నీవీ అపరాత్రివేళ ఇంత ప్రయాసపడుతున్నావో నాకు తెలియదు. కాని నిన్ను చూస్తుంటే నాకు మాకందుడి కథ జ్ఞాపకం వస్తున్నది. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకై, యుద్ధంలో గెలిచే సమర్థత ఉండికూడా ఓడిపోయి తనకూ, తన రాజుకూకూడా అపకీర్తి తెచ్చిన మాకందుడి కథ చెబుతాను విను," అంటూ ఈవిధంగా చెప్పసాగాడు:

పూర్వం కోసలదేశాన్ని ఏలిన మహానంద మహారాజు గొప్ప కీర్తిమంతుడు. ఆయన రాజ్యంలో ఎన్నడూ అరాజకమన్నది లేదు.

## బేతాళ కథలు



ఆయనను సామంతులు ఎంతో భక్తి విశ్వా సాలతో కొలిచారు. అయితే ఒకప్పుడు రుద్ర గిరిని ఏలిన రుద్రవర్మ అనే సామంతుడు మహారాజును తృణీకరించి తాను సర్వ స్వతంత్రుడైనట్టుగా ప్రవర్తించాడు.

మహానందుడు శాంతిప్రియుడై ఉండి కూడా, రుద్రవర్మ ధిక్కారాన్ని సహించలేక, పదిమంది సామంతులనూ, పదివేల సైన్యాన్నీ వెంటబెట్టుకుని వెళ్లి రుద్రగిరి కోటను ముట్టడించి, లొంగిపోవలిసిందిగా రుద్రవర్మకు కబురు చేశాడు.

రుద్రవర్మ ఈ ముట్టడికి ముందుగానే సిద్ధపడి ఉండటంచేత మహారాజుకు లొంగక, చేతనైతే కోటను జయించమని కబురుపంపాడు. నిజానికి రుద్రగిరి కోట దుర్భేద్యమైనది. రుద్రవర్మ వద్ద శౌర్య పరాక్రమ సంపన్నులైన వీరులున్నారు, యుద్ధ నైపుణ్యం గలిగి సుశిక్షితమైన సేన ఉన్నది. అందుచేత మహానందుడి బలాలు కోటపై ఎన్ని దాడులు చేసినా అన్ని దాడులూ విఫలమయాయి.

చివరకు తటస్థ పరిస్థితి ఏర్పడింది. కోట లోపలివారు లోపల ఉండిపోయారు, బయటి వారు బయటనే ఉండిపోయారు. ముట్టడి ఎన్ని మాసాలు సాగినా యుద్ధంమటుకులేదు.

ఈ పరిస్థితి చూసి ఉభయపక్షాలకూ విసుగెత్తిపోయింది. "ఎందుకొచ్చిన బెడద! ముట్టడి ఎత్తేసి వెళ్ళిపోదాం," అని మహానందుడికీ అనిపించింది, రుద్రవర్మకూ అనిపించింది. వెళ్ళిపోవటం మహారాజుకు అవమానం; యుద్ధంకూడా లేకుండా లొంగిపోవటం రుద్రవర్మకూ తలవంపులే.

మహానందుడివెంట ఉన్న యువక వీరులలో ఒకడు మూకందుడు. అతను మహానందుడి మేనల్లుడు. బల శౌర్య పరాక్రమాలలో అతనికి సాటి అనదగినవాడు ఆ సైన్యంలో ఒక్కడూ లేడు. అతనికి యుద్ధం చేసే ఈడు వచ్చాక తన ప్రతాపం చూప



టానికి వచ్చిన మొదటి అవకాశం ఇదే. కాని అది యుద్ధం జరిగితేనేగద చూపేది?

ఊరికే కూచోవటం ఇష్టంలేక మాకందుడు రోజూ చుట్టుపక్కల అరణ్యాలలో వేటాడేవాడు. అప్పుడప్పుడూ తన సాటివారిని కొందరిని మైదానంలో చేర్చి యుద్ధ కౌశలంలో పోటీ పందాలు ఏర్పాటుచేసి వాటిలో ప్రతిసారీ తానే అందరినీ ఓడిస్తూ ఉండేవాడు. మిగిలినవాళ్ళు అతని అస్త్ర లాఘవాన్ని అలవరుచుకోవటానికి ప్రయత్నించేవారు.



రుద్రవర్మకు తమ్ముడి కొడుకు ఒక యువకుడు, అన్నివిధాలా మాకందుడి లాటివాడే ఉన్నాడు. అతని పేరు మిత్ర వర్మ. అతను కోటగోడలమీదనుండి మాకందుడు మొదలైనవారు చేసే పరాక్రమ పోటీలు చూశాడు. ఆ పోటీలలో తనుకూడా పాల్గొనాలని అతడికి అభిలాష పుట్టింది. అందుచేత ఒకనాడు అతను సామాన్యుడి దుస్తులు ధరించి ఎవరూ చూడకుండా కోట ద్వారం వెలువడి, చెట్ల మధ్యగా పోటీ పందాలు జరిగే చోటికి చేరుకున్నాడు. అతన్ని చూసి ఎవరూ శత్రుపక్షంవాడని సంశయించ లేదు, తమపక్షంవాడే అయి ఉంటాడనుకున్నారు.

మిత్రవర్మ తననుకూడా పోటీలలో పాల్గొననిమ్మని అడిగితే వారు సమ్మతించి అతనికి అవసరాన్నిబట్టి కవచమూ, ఇతర ఆయుధాలూ, గుర్రమూ మొదలైనవి ఇచ్చారు. కాని అతను ప్రతి ఆయుధం తోనూ అందరినీ ఓడించి, మాకందుడికి ఎందులోనూ తీసిపోనివాడని రుజువు చేసుకున్నాడు. అప్పుడుగాని మహారాజు తరఫు యోధులకు అనుమానం తగలలేదు. వాళ్ల ముఖాలమీది చిరునవ్వులు మాయమై పోయాయి. "మాలో ఇంత మేటివీరుడు మాకు తెలియని వాడెవడున్నాడు? నువు శత్రుపక్షం వాడివిలా ఉన్నావు? నీ పేరేమిటి?

మీ తండ్రి ఎవడు? మీదే దేశం?" అని వారు ప్రశ్నల వర్షం కురిపించారు.

మిత్రవర్మ దేనికీ జవాబు చెప్పకపోయే సరికి వారి అనుమానం రెట్టింపయింది. వారు తనను పట్టుకోవటానికి మీదికి రావటం చూసి మిత్రవర్మ ఒక గుర్రంమీదికి దూకి కోటకేసి పారిపో నారంభించాడు.

మాకందుడికి మండిపోయింది. "పట్టుకోండి! తప్పించుకు పోనివ్వకండి!" అని కేకలు పెడుతూ అతనుకూడా ఒక గుర్రం ఎక్కి మిత్రవర్మను తరమ నారంభించాడు. మాకందుడి గుర్రం గొప్పజాతిది; అది వాయువేగంతో పరిగెత్తి, మిత్రవర్మ గుర్రం కోటద్వారాన్ని చేరవచ్చే సమయానికి దాన్ని అందుకున్నది. మాకందుడు తన కత్తి దూసి మిత్రవర్మ తల తెగవేయబోతుండగా కోట గోడమీదినుంచి ఎవరో స్త్రీ కెవ్వున అరిచి, "చంపవద్దు! మా అన్నను చంపవద్దు!" అని కేకపెట్టటం మాకందుడి చెవినపడింది.

అతను ఆశ్చర్యంతో తల ఎత్తి చూశాడు. అద్భుత సౌందర్యరాశి అయిన ఒక పిల్ల కిందికి చూస్తూఉండటం అతనికంట పడింది. నిండు చంద్రుడులాటి ఆమె ముఖంలో భయమూ, ఆందోళనా చూసి మాకందుడు స్తంభించిపోయాడు. ఎత్తిన చెయ్యి కత్తితో సహా అలాగే దిగిపోయింది.



ఈ లోపుగా మిత్రవర్మ కోటద్వారం కుండా లోపలికి ప్రవేశించి అదృశ్యుడై పోయాడు. మాకందుడు తన గుర్రాన్ని వెనక్కు తిప్పి మెల్లిగా నడుపుకుంటూ పరధ్యానంగా తమ శిబిరానికి తిరిగి వచ్చాడు. తనతో సమంగా ప్రతాపం చూపించిన మహా యోధుణ్ణీ, అప్సరసలను తలదన్నగల సౌందర్యవతి అయిన అతని చెల్లెలినీ అతను క్షణంపాటుకూడా మరిచిపోలేకపోయాడు. తన ప్రతిపక్షిపైన పుట్టిన అసూయ అంతా మటుమాయమయింది; మాకందుడికి ఇప్పుడా యువకుడు తన ఆప్తుడిలాగా కనబడ్డాడు.

మిత్రవర్మ మాకందుడి ప్రతాపాన్ని మొదటినుంచీ హృదయపూర్వకంగా మెచ్చుకున్నాడు. "నేను శత్రుపక్షంవాణ్ణి కనకనే గదా అతను నన్ను చంపవచ్చింది! అటువంటివాడు మిత్రుడుగా ఉండటం ఎంత ఆనందంగా ఉంటుంది!" అనుకున్నాడు.

అది మొదలు మిత్రవర్మ తన పెత్తండ్రి అయిన రుద్రవర్మతో, "మహారాజుతో సంధి చేసుకో! ఏమిటీ అర్థంలేని యుద్ధం! ఆయన పైన తిరుగుబాటు చేయటం మనదే తప్పు. అందుచేత మనమే సంధి రాయబారం పంపటం భావ్యంగా ఉంటుంది," అని బోధించాడు.





"అయితే నువే రాయబారం వెళ్లు. ఆయన ముట్టడి చాలించి వెళ్లిపోయే పక్షంలో నేను ఎప్పటిలాగే ఆయనకు లోబడి సామంతుగా కొలుస్తాను. అంతకు మించి నేను ఏమాత్రమూ దిగిరాను. ఈ యుద్ధంలో ఓడిపోయినట్టుకూడా ఒప్పుకోను," అన్నాడు రుద్రవర్మ.

మిత్రవర్మ మహనంద మహారాజువద్దకు రుద్రవర్మ తరఫున రాయబారిగా వెళ్లి సందేశం విన్నవించాడు.

"నాకు సామంతుడుగా ఉండటంలో శిక్ష ఏమున్నది? అతని తిరుగుబాటుకు శిక్ష ఏమిటి? అతను ఓటమి అంగీకరించి నన్ను శరణు వేడితేనేగాని పై సంగతి నిర్ణయించను!" అన్నాడు మహారాజు.

"మహారాజా, తమకు పాదాక్రాంతుడు కావటానికి మా రాజుగారు ఎంతమాత్రమూ సమ్మతించడు. నా ప్రయత్నం విఫలమయినందుకు విచారిస్తున్నాను. సెలవిప్పించండి!" అన్నాడు మిత్రవర్మ.

మాకందుడు అతనిని కలుసుకున్నాడు. ఇద్దరూ అబాల్యస్నేహితులలాగే అలింగనం చేసుకున్నారు. మాకందుడు అతనిని కొంత దూరం సాగనంపటానికి బయలుదేరాడు.

"విధివశాన మన రాజులిద్దరూ విరోధులైనప్పటికీ మనం అజన్మ మిత్రులంగానే ఉందాం! నాకు నీపైన మిత్రభావం వున్నది. నీవంటి యోధుడు నాకు మిత్రుడంటే నేను గర్విస్తాను," అన్నాడు మిత్రవర్మ.

"నేనూ అంతే!" అన్నాడు మాకందుడు. అంతలో అతనికొక అలోచన వచ్చింది. "చూడు, మిత్రవర్మా! ఈ యుద్ధం అంతం చెయ్యటానికి ఒక పని చేద్దాం. ఉభయ పక్షాల తరఫునా మనమిద్దరమూ ద్వంద్వ యుద్ధం చేద్దాం. మనం మిత్రులం కనక మాత్సర్యం లేకుండా పోరాడగలం. మనలో ఎవరు గెలిస్తే వారిపక్షం గెలిచినట్టు! ఏమంటావు?" అన్నాడు.



"ఈ సంగతి నేను మా పెత్తండ్రితో చెప్పి ఒప్పిస్తాను. నువ్వు మహారాజుతో చెప్పి ఒప్పించు!" అన్నాడు మిత్రవర్మ.

తరవాత ఇద్దరూ కొంచెంసేపు మాట్లాడుకుని విడిపోయారు.

రెండుపక్షాలమధ్యా మరొక రాయబారం జరిగింది. మహానంద మహారాజు ఈ విధంగా పందెం ఏర్పాటు చేశాడు: "ద్వంద్వయుద్ధంలో నా యోధుడైన మాకందుడు ఓడిపోతే నేను ముట్టడి చాలించి వెళ్ళిపోవటమే గాక, నిన్ను స్వతంత్రుణ్ణిగా గుర్తిస్తాను. నీ యోధుడైన మిత్రవర్మ ఓడిపోతే నీవు నీ రాజ్యాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోవాలి."

ఈ నిబంధనకు రుద్రవర్మ ఆమోదించాడు. ఆయనకు తన తమ్ముడి కొడుకు పరాక్రమంలో అపారమైన విశ్వాసం ఉన్నది.

రుద్రగిరి కోటకు కొంతదూరంలో ఒక నది ప్రవహిస్తున్నది. నదికీ కోటకూ మధ్య గల మైదానంలో ద్వంద్వయుద్ధం ఏర్పాటు చేశారు. రుద్రవర్మ పక్షంవారందరూ కోట గోడలపైన చేరారు, మహారాజు పక్షంవారు నది ఒడ్డున చేరారు. ద్వంద్వయుద్ధం జాము పొద్దెక్కి ప్రారంభమయింది. మధ్యాహ్నం దాకా యుద్ధం సాగినా ఏ ఒకరూ ఓడలేదు. అంత సమంగా బలపరాక్రమాలు గల యోధులను ఊహించుకోవటం అసంభవం.






"మిత్రవర్మా, ఎండ తీవ్రంగా ఉన్నది. కాస్సేపు విశ్రాంతి తీసుకుందాం!" అన్నాడు మాకందుడు.

ఇద్దరూ ఆప్యాయంగా చేతులు పట్టుకుని ఎడంగా నడిచివచ్చి చెట్టు నీడలో కూచున్నారు. ఇద్దరికీ భోజనాలు వచ్చాయి. కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేసి గడ్డిపైన పడుకుని విశ్రమించారు. పొద్దు వాలింది. మళ్ళీ ఇద్దరూ యుద్ధానికి ఉపక్రమించారు. మధ్యలో అకస్మాత్తుగా మిత్రవర్మ చేతి కత్తి రెండుగా విరిగిపోయింది. కోటమీది నుంచి హాహాకారాలూ, నది ఒడ్డునుంచి హర్ష ధ్వానాలూ వినబడ్డాయి.

కాని మాకందుడు తన కత్తి దూరంగా పారేసి, "నేను నిరాయుధుడితో ఆయుధం లేకుండానే పోరాడతాను," అన్నాడు. అతని ఔదార్యానికి మిత్రవర్మ ముగ్ధుడయాడు. తరవాత ఇద్దరూ మల్లయుద్ధం సాగించారు. అందులోకూడా ఇద్దరూ సమ ఉజ్జీలే. ఏ ఒకరూ రెండోవాణ్ణి పడగొట్టలేకపోయారు.

సూర్యాస్తమానం కావస్తున్నది. కోటమీది వాళ్ళకూ, నది ఒడ్డున ఉన్నవాళ్ళకూ కూడా ముళ్ళపై ఉన్నట్టు ఆత్రంగా ఉన్నది. ఇంతలో అకస్మాత్తుగా, అకారణంగా, మాకందుడు కింద పడిపోయాడు. కోట గోడమీదనుండి చూస్తున్నవారిలో హర్ష ధ్వానాలు వెర్రిగా చెలరేగాయి. నది ఒడ్డున ఉన్నవారందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు.

"మహారాజా, నేను ఓడిపోయాను!" అన్నాడు మాకందుడు లేచి కూచుంటూ.

మాట తప్పకుండా మహానంద మహారాజు రుద్రవర్మ విజయాన్ని ఆమోదించి, అతన్ని స్వతంత్ర రాజుగా గుర్తించి, ముట్టడి ఎత్తి తన దేశానికి తిరిగి వెళ్ళిపోయాడు.

మాకంద మిత్రవర్మల మైత్రి మరింత గాఢమయింది. త్వరలోనే మాకందుడు తన మిత్రుడి చెల్లెలిని వివాహం కూడా చేసుకున్నాడు.



బేతాళుడీకథ చెప్పి, "రాజా, మాకందుడు ఓడిపోయినట్టు ఎందుకు నటించాడు? మిత్రవర్మ చెల్లెలిపైన గల ప్రేమచేతనా? తాను ప్రేమించిన మనిషికి అన్న అయినవాణ్ణి గెలవనిస్తే ఆమె తనపట్ల మరింత అనుకూలవతి అవుతుందనా? లేక మిత్రవర్మను సంతోషపెట్టటానికే అతను అలా చేశాడా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అసలు కారణం ఇవేవీ కావు. మిత్రవర్మకు అతనిపై అదివరకే ఘనమైన అభిప్రాయం ఉన్నది. తన మిత్రుడి చెల్లెలిని వివాహమాడటంకూడా మాకందుడికి ఏమంత కష్టంకాదు. మహానందుడు తమ ద్వంద్వయుద్ధం సందర్భంలో ఏర్పాటుచేసిన నిబంధన మాకందుడికి అక్రమమని తోచింది. యుద్ధం తప్పించటానికే అతను ద్వంద్వయుద్ధం సూచించాడుగాని, తాను గెలిచి రుద్రవర్మను రాజ్యభ్రష్టుణ్ణి చెయ్యాలనే ఉద్దేశంతో కాదు. యుద్ధమే జరిగినా కూడా రుద్రవర్మను రాజ్యభ్రష్టుణ్ణి చేసే శక్తి మహారాజుకు లేదు. ఆయన ఎన్నోసార్లు యుద్ధం విరమించి వెళ్లిపోవాలనుకుని కూడా పరువు భంగమవుతుందని మానేశాడు. అలాటప్పుడు తాను రుద్రవర్మకు రాజ్యనష్టం కలిగించటంకన్న అక్రమంచేసి అయినా ఆయనను స్వతంత్రుణ్ణి చెయ్యటమే ఎక్కువ ధర్మమని మాకందుడు భావించాడు. లేనిపక్షంలో, మిత్రవర్మ చేతికత్తి విరిగిపోయినప్పుడే అతను తాను గెలిచానని ఉండేవాడు. చేతికందిన విజయాన్ని అతను కత్తితోబాటే విసిరి పారెయ్యటాన్నిబట్టి అతనికి విజయవాంఛ లేదని స్పష్టమయింది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)



## అజంతా చిత్తరువులు

మనదేశపు ప్రాచీన చిత్రకళకు అజంతా చిత్రాలను మించిన నమూనా లేదు. వింధ్య పర్వతాల కనుమ ద్వారంవద్ద అర్ధచంద్రాకారంగా వ్యాపించి ఉన్న 250 అడుగుల ఎత్తుగల కొండలో క్రీస్తు శకారంభంలో బౌద్ధులు గుహలు తొలిచి తమకొరకు చైత్యాలనూ, విహారాలనూ నిర్మించారు. ఈ గుహల లోపల శిల్పాలు చెక్కారు. గుహల నిండా బుద్ధుడి సంబంధమైన కథలను కుడ్య చిత్రాలుగా నిర్మించారు. ఈ గుహల నిర్మాణం ఏడెనిమిదివందల ఏళ్ళపాటు సాగిందట. ఇలాటి చిత్ర, శిల్పకళా ప్రదర్శనం మన దేశంలో మరెక్కడా లేదు. అజంతా గుహలలో 25 విహారాలూ, 5 చైత్యాలూ (బౌద్ధదేవాలయాలూ) ఉన్నాయి. ఇక్కడి కుడ్యచిత్రాలనూ, శిల్పమయమైన చెక్కడాలనూ చూడటానికి ప్రపంచమంతటినుంచీ యాత్రికులు వస్తూవుంటారు.

చిత్రమేమంటే అజంతా చిత్రకళా, శిల్పకళా బౌద్ధంతోబాటే మరుగున పడిపోయింది. 1819లో కొందరు యూరపియన్ సైనికులు వీటిని కనిపెట్టగా ప్రపంచానికి వీటినిగురించి తెలియవచ్చింది.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1960 ఆగష్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు సమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమింగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కల్తీ తూకం కాదండీ!

రెండవ ఫోటో: కానీ తక్కువ లేదండీ!

పంపినవారు: శిష్లా సీత, 15 తిరుమూర్తి వీధి, మదరాసు-17.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




1. *జె. డి. విక్టర్, మహబూబ్ నగర్*

జ్వాలాద్వీపవాసులు ఎక్కివచ్చే క్రొత్త భయంకర పక్షి నిజమైనదా? కల్పితమా?

అలాటి పక్షులు అనేక కోట్ల ఏళ్ళక్రితం భూమిపై నిజంగా ఉండేవి. అవి ఎగిరే బల్లులు. వాటిని మనుషు లెక్కి తిరిగారన్నది మాత్రం కల్పన.

2. *మేళ్ళవెర్వు వెంకటశివనాగేంద్రమారుతీప్రసాదు, కొల్లూరు*

"కంచుకోట"లో చంద్రవర్మను పంపిన తర్వాత కాపాలిని చనిపోయినదా?

అవును. ఆ సంగతి స్పష్టంచేయబడింది.

3. *ఎం. కే. వి. దేశికన్, నెల్లూరు*

అన్నయ్యా, "చందమామ" స్థాపించినప్పటినుండి ఫొటోవ్యాఖ్యల పోటీ ఉందని నా మిత్రుడు, లేదని నేను....

"చందమామ" ప్రారంభం 1947 జులై సంచికతో. ఫొటోవ్యాఖ్యల పోటీ ప్రారంభం 1952 జులై సంచికనుంచి.

4. *కాకర్ల తాతారావు, గాదెలపాలెం*

"మకరదేవత, తోకచుక్క" పుస్తకరూపంగా వస్తాయన్నారు. ఇంకా ఎన్ని దినాల్లో వస్తాయండి?

అనివార్య కారణాలవల్ల ఆ పుస్తకం ప్రచురించటంలో ఆలస్యమయింది. త్వరలోనే వస్తుంది, కొంచెం ఓపిక పట్టాలి.

5. *డి. గంగారాం, నిర్మల*

ఫొటోవ్యాఖ్యలు తెలుగు "చందమామ"కే గాక హిందీదికూడా ఒకే కార్డులో వ్రాసి పంపవచ్చునా?

వద్దు. ఏ భాషలో వ్యాఖ్యలు ఆ భాషకు సంబంధించినవారే చూస్తారు. కనుక వేరు వేరు కార్డులు రాయాలి.

6. కె. సత్యనారాయణ, సీతానగరం

మన "చందమామ" అట్టపై వేసెడి బొమ్మల భారత కథను యెప్పటి నుండి ప్రచురిస్తున్నారు?

1952 జులై సంచికనుంచి.

7. కె. ఎస్. వి. సీత, రాజమండ్రి

ఇప్పుడు ప్రచురిస్తున్న "గలివర్ యాత్రలు" మునుపు ప్రచురించిన "వర్ధమాన విదేశయాత్రలు" ఒకటేనా?

అవును.

8. కావుగంటి సూర్యారావు, నర్సాపట్నము

మీరు పుస్తకములో వేయుచున్న కథలు చాలా బాగుంటున్నాయి. "గంగావతరణము," "భాసుని నాటక కథలు," "కంచుకోట" పుస్తకాలుగా వెలువడ్డాయా?

వెలువడతాయిగాని, కొంతకాలం పడుతుంది. పుస్తకాల ప్రచురణకు ఇప్పుడు చేస్తున్న ఏర్పాట్లింకా పూర్తికాలేదు.

9. పా. ఛాయదేవి, మద్రాసు

"చందమామ" చందాదారుల ఇండ్లలోకంటె అంగడిలో మొదట ఉంచుట చాలా శోచనీయము.

శలవరోజులు అడ్డువచ్చినప్పుడు పోస్టులో వచ్చే కాపీ ఆలస్యం కావచ్చు.

10. కె. ఇందిర, నెల్లూరు

ప్రపంచ సప్తాద్భుతములలో "తాజ్ మహల్" ఒకటిగదా. మరి మీరు మే నెల సంచికలో దాని పేరు ప్రచురించ లేదేమి?

తాజ్ మహల్ ఆధునిక ప్రపంచాద్భుతాల కిందికి వస్తుంది. మే నెలలో ప్రస్తావించినవి ప్రాచీన ప్రపంచాద్భుతాలు.

11. మందలపర్తి భుజంగరావు, భీమవరం

"చందమామ"లో నెలనెలా ప్రచురించే చీనా జానపద కథల రచయిత ఎవరండీ? ఒక కథ ప్రచురించటానికి ఎన్నాళ్ళు ముందుగా సెలెక్ట్ చేస్తారు?

చీనా జానపద కథలు మా కార్యాలయంలోనే తయారవుతున్నాయి. "చందమామ"లో పడే కథలు మూడు నెలలు ముందుగానే నిర్ణయమవుతాయి.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు మామిడి తోటలోకి వెళ్ళి, కాయలు కోసి ఒక బుట్టలో పడవేశారు. తరవాత వాళ్ళు ఆ బుట్టతో కాలవ దగ్గిరకు వచ్చి, తాము కోసిన కాయలను లెక్క పెట్టసాగారు. 'టైగర్' ఖాళీగావున్న బుట్టను నోటితో పట్టుకుని కాలవ నీళ్ళలోకి లాగసాగింది. అది చూసిన కాట్లకుక్క ఒకటి భయంకరంగా మొరుగుతూ పరిగెత్తుకు వచ్చేసరికి, 'టైగర్' పక్కకు పారిపోయింది. కాట్లకుక్క ఆ ఊపులో ఖాళీబుట్టలో పడింది. బుట్ట దానితోపాటు నీళ్ళల్లో పడి కాలవ మధ్యకు కొట్టుకుపోయి బుడుంగుమంటూ మునిగింది. కాట్లకుక్క నీళ్లల్లో గిలగిలా కొట్టుకుని మునిగి తేలుతూ, సగం చచ్చి అవతలి ఒడ్డును చేరింది.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# అశోకా అమ్లా రత్నత్రయము

## అశోకా ఆమ్లా హేరాయిల్
## పొమేడ్ - బ్రిలియన్‌టైన్

నల్లని కురులకు
చల్లని గుణమునకు






**విజయ కెమికల్స్,, మద్రాసు 7.**



మీ
పాపాయికి
ఇష్టం

## స్పెన్సర్స్
## గ్రైప్ సిరప్

పసిపిల్లల సమస్తమైన అజీర్ణ
వ్యాధులకు




ఆంధ్ర రాష్ట్రానికి సోల్ డిస్ట్రిబ్యూటర్లు:

**ది స్వతంత్రా ఏజెన్సీస్,**

రామవిహార్, హనుమాన్‌పేట, విజయవాడ-2.




దిన
దినానికీ
దిన
దినానికీ
ది...




రెక్సోనాలో కేడిల్ -
చర్మమును పోషించుచూ, దానిని అతి
సొగసుగాను... అతి మనుపుగాను,
అతిమృదువుగాను వుండునట్లు చేయు
నట్టి చర్మసౌందర్యమును గలిగించే
నూనెల ప్రత్యేక మిశ్రమం వున్నది!
రెక్సోనాయొక్క ప్రత్యేక పరిమళం,
మీకు రోజంతా హాయిగొలుపును!
సౌందర్య సహకారియైన
రెక్సోనా రోజూ వాడండి!
Rexona
BLENDED WITH CADYL
రెక్సోనా సబ్బు మీ చర్మమును అతి సొగసుగానుంచును
RP.164-50 TL
ఆస్ట్రేలియాలోని రెక్సోనా ప్రొ.లి., తరపున భారతదేశంలో తయారుచేయబడినది.

# మొటిమలు మాయమగును
# చర్మము మృదువుగా శుభ్రపడును

నిక్సోడెర్మ్ (NIXODERM)ను రాసినచో మొటిమలు మాయమగును. నేటి రాత్రి నిక్సోడెర్మ్ (NIXODERM) వాడి చూచినచో చర్మము మృదువుగాను, నాజూకుగాను శుభ్రపడునని గమనించగలరు. మొటిమలు, కురుపులు, ఎర్రని మచ్చలు, దురద, తామర మొదలగువాటికి కారణభూతమగు క్రిమి జాలమును శాస్త్రోక్తముగా తయారైన నిక్సోడెర్మ్ (NIXODERM) సంహరించును. చర్మపు రంధ్రములలో దాగియుండు వేరువేరు క్రిమి జాలమును తొలగించని ఎడల మీ చర్మ వ్యాధులు నివారించవు. మీ మొటిమలను నిశ్చయముగా పోగొట్టి చర్మమును మృదువుగాను, నాజూకుగాను శుభ్రము చేయు నిక్సోడెర్మ్ (NIXODERM)ను నేడే మీ కెమిస్టువద్ద కొనండి.

(N. 31-4 TEL.)

# మీరు నిద్రించునప్పుడు
# ఉబ్బసపు తెమడను సడలించును

ఊపిరి బిగదీయుట, దగ్గు, శ్లేష్మము, గొంతు నొప్పి, ఉబ్బసము, రొమ్ము పడిశము, జలుబు మరియు తాపజ్వరము మొదలగు వ్యాధులతో బాధపడు వేలకొలది రోగులు యిక వీటికి భయపడ నవసరములేదు. అమెరికా దేశపు ఆధునిక ఔషధముతో శాస్త్రోక్తముగా తయారైన ఈ మందు, గుండె, ముక్కు మొదలగు భాగములకు రక్తము ద్వారా వ్యాపించి శ్లేష్మమును హరించును. మీకు వెంటనే ఊపిరి బాగుగా సలుపును, దగ్గు శ్లేష్మము తగ్గి పసిబిడ్డవలె నిద్రించగలరు. పూర్తిగా తృప్తినిచ్చుటకు గ్యారంటీ యివ్వబడిన మెండకో (MENDACO)ను మీ కెమిస్టువద్ద కొనండి.

(M. 33-2 TEL.)




# మిఠాయిలు




న్యూట్రిన్‌వారి రుచికరమైన మిగడ గల టాఫీలు, మీరు పదిలపరుచుకోవడానికి ఉత్సాహపడేటంతటి రమ్యమైన టిన్నులలో దొరకును.

అదీగాక, న్యూట్రిన్ టిన్నులలో మిఠాయిలు సగముసగము గాకుండా, పూర్తిగా నింపుటచే, మీకు ఎక్కువ టాఫీలు లభించును.

---

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ
ప్రైవేట్ లిమిటెడ్
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్.

---

# బాధ నివారణకు సంతోషమగు విధానము

నోపిన్ [illegible]—నోపిన్ [illegible]

నోపిన్ [illegible]

నోపిన్ [illegible]

# నోపిన్




ది కలకత్తా కెమికల్ కం. లిమిటెడ్, కలకత్తా—29.
1919 నుండి దేశమును సేవించుచున్నది.

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

కానీ తక్కువ లేదండీ

పంపినవారు:
ఎస్. సీత - మదరాసు - 17.

